


# అగ్నిహోత్రం 100% వైజ్ఞానికం

పంచమ పరివర్ధిత సంస్కరణము

(దైనిక అగ్నిహోత్ర విధి సహితము)



కర్త :

**సుమ్నార్థి**

(డా. కోడూరి సుబ్బారావు)

ప్రకాశకులు :

## గాయత్రీ ఆశ్రమ ట్రస్టు

12-10-586/6, ఆర్యసమాజము-వ్యాస్‌నగర్,

మేడిబావి, వారాసిగూడ, సికింద్రాబాద్ - 500 061.

గాయత్రీ గ్రంథమాల : 56
అగ్నిహోత్రం 100% వైజ్ఞానికం
పూర్వ ముద్రణల ప్రతులు : 7000.
పంచమ పరివర్ధిత సంస్కరణము : 1000.

సృష్టిసంవత్సరము : 197, 29, 49, 117.
విక్రమాబ్దము : 2074.
కలియుగాబ్దము : 5116.
దయానందాబ్దము 192
శ్రీ హేవళంబి సం॥రం మార్గశీర్ష పౌర్ణమి (03-12-2017)

**మూల్యము : రూ. 60=00.**
(తపాలా ఖర్చులు అదనము)

ప్రతులకు :

1. బాశెట్టి సత్తయ్య, జె-38,
రాంగోపాల్‌పేట్, సికింద్రాబాద్ - 500 003.
2. గాయత్రీ ఆశ్రమ ట్రస్టు, ఆర్యసమాజము,
12-10-586/6, వారాసిగూడ, సికింద్రాబాద్ - 500 061.
కార్యదర్శి : శ్రీ కె.పి. నర్సింగ రావు. సెల్ : 98480 11073.
3. ఆర్యసమాజము, మెయిన్‌రోడ్డు, సీతాఫలమండి - 500 061.
4. ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా).
ఫోన్ : 08644-252789.
5. డా॥ కోదూరి సుబ్బారావు, వైదికవానప్రస్థాశ్రమం,
హనుమాపురం (P.O.) ; (Via.) భువనగిరి గంజ్ - 508 117.
సెల్ : 9290604641, 9908994084.

*Printed at :*

**PRINTSHOP** - 6632 0300.



# సృష్టికర్త ఆదేశం

**సమిధాగ్నిం దువస్యత, ఘృతైర్బోధయతాతిథిమ్ ।**
**ఆస్మిన్ హవ్యా జుహోతన ॥**
**సుసమిద్ధాయ శోచిషే ఘృతం తీవ్రం జుహోతన ।**
**అగ్నయే జాతవేదసే ॥**

– యజుర్వేదం (3-1, 2)

ఓ మానవులారా ! సమిధలతో అగ్నిని చక్కగా జ్వలింపచేయండి. అతిథిని సత్కరించునట్లు శ్రద్ధాభక్తులతో ఘృతమును ఆహుతులుగా యివ్వండి. ఆ విధంగా ప్రదీప్త మొనర్చబడిన యజ్ఞాగ్నిలో హవ్యములను -స్థాలీపాక పాయసాదులను, మూలికలను, సుగంధ ద్రవ్యాలను, ఆహుతులుగా యివ్వండి.

అట్టి యజ్ఞాగ్నిలో బాగా కరిగించబడిన నేతిని జాతవేదాగ్నికి ఆహుతులుగా యివ్వండి. ఆ జాతవేదాగ్ని జలవాయువులను సంస్కరిస్తుంది - శుద్ధి చేస్తుంది. తద్వారా ప్రాణులన్నిటికి గొప్పమేలు జరుగుతుంది.



# సృష్టికర్త యజ్ఞ స్తుతి

**వసోః పవిత్రమసి, ద్యౌరసి, పృథివ్యసి, మాతరిశ్వనో**
**ఘర్మోసి, విశ్వధా౽ అసి, పరమేణ ధామ్నా దృగ్ంహస్వ,**
**మా హ్వార్మా తే, యజ్ఞపతి ర్హ్వార్షీత్ ॥** – యజుర్వేదం (1–2)

ఓ మానవులారా !

వసోః పవిత్రమసి = యజ్ఞము చాలా పవిత్రమైనది.

[యజ్ఞో వై వసుః', – శతపథ బ్రాహ్మణం (1–5–4–9) ]

ద్యౌరసి = సూర్యాది ఊర్ధ్వలోకాలకును అది ఆహుతులను చేరుస్తుంది.

పృథివ్యసి = యజ్ఞవాయువు భూలోకమంతటను వ్యాపిస్తుంది.

(మేఘాలలో చేరి అందలి జలాన్ని శుద్ధిచేస్తుంది. అవి వర్షించినపుడు భూమిలోనికి యింకి ఎరువుగా పంటలను వృద్ధిచేస్తుంది.)

మాతరిశ్వానో ఘర్మోసి = వాయువును పవిత్రం చేస్తుంది.
తద్వారా ప్రాణులన్నీ పవిత్రమౌతాయి.

విశ్వధా అసి = అన్నిటిని ధారణ చేస్తుంది.

పరమేణధామ్నా దృగ్ంహస్వ = ఉత్తమ సుఖములను ప్రసాదిస్తుంది.

మా హ్వాతే = అట్టి యజ్ఞాన్ని విడిచిపెట్టవద్దు.

మా యజ్ఞపతిః హ్వార్షీత్ = విశేష యజ్ఞాలు చేయువారి సాంగత్యాన్ని
కూడా విడిచిపెట్టవద్దు.

# ఈ ' అగ్నిహోత్రం 100% వైజ్ఞానికం' లో



**చదవండి - వివేచించండి - సత్యాన్ని గ్రహించండి**
**అగ్నిహోత్రాన్ని ఆచరించి ఆరోగ్యాన్ని, ఆనందాన్ని పొందండి.**

# ప్రకాశకీయము

"యజ్ఞో వై శ్రేష్ఠతమం కర్మ' - యజ్ఞం (అగ్నిహోత్రం) నిశ్చయంగా శ్రేష్ఠతమ కర్మ - పరోపకార కర్మలలో ఉత్తమోత్తమమైన"దని యాజ్ఞవల్క్య మహర్షి తమ శతపథ బ్రాహ్మణం (7-1-5)లో అన్నారు. ఇది పక్షపాతంలేకుండా ప్రాణులన్నిటికి మేలు చేస్తుంది. భూలోక ప్రాణులకే కాక భువర్లోక (అంతరిక్ష) స్వర్లోక (ద్యులోక) ప్రాణులకును మేలు చేస్తుంది. తక్కువ ఖర్చుతో ఎక్కువ లాభం కలుగుతుంది. పంచభూతాలను శుద్ధి చేయటానికి ఇంతకన్న సరళమార్గం మరొకటి లేదు. అందుకనే వేదం అగ్నిహోత్రాన్ని వేనోళ్ళ కీర్తిస్తుంది. భారతీయ సంస్కృతి యంతా అగ్నిహోత్రంతో ముడిపడి ఉంది. పూర్వం యజ్ఞ మాధ్యమంగానే సంగతికరణ (సంఘటన), దానాలు జరిగేవి.

వేదకాలంనుండి మహాభారత కాలంవరకు అగ్నిహోత్రం చాలా పవిత్రంగా ఉండేది. మధ్యకాలంలో అది పశుహింసతో కలుషితమయ్యింది. దానితో జైన బౌద్ధ మతాల ఆవిర్భావం జరిగింది. వాటి ప్రభావంతో అగ్నిహోత్రం మరుగున పడిపోయింది. మహర్షి దయానందులవారు దానిని మరల పునరుద్ధరించి దానివల్ల కలిగే అనేక ప్రయోజనాలను వివరించి చెప్పారు. అనంతరం దేశ విదేశాలలో అగ్నిహోత్రంపై చాలా పరిశోధనలు జరిగాయి. అమెరికాలో అగ్నిహోత్ర విశ్వవిద్యాలయం (అగ్నిహోత్ర యూనివర్సిటీ) కూడా స్థాపించబడింది. 'హోమా థెరపీ ఇన్ జర్మనీ" (పేరుతో జర్మనీ దేశంలో యజ్ఞభస్మంతో మందులుచేసి చికిత్సలు చేస్తున్నారు. అద్భుతమైన ఫలితాలు వస్తున్నాయి. వాటన్నిటిని శ్రీ సుమ్నార్థి - డా. కోడూరి సుబ్బారావుగారు ఈ పుస్తకంలో వివరించారు. వారికి మా హృదయపూర్వక ధన్యవాదములు. ఇది పంచమ పరివర్ధిత సంస్కరణము.

ఈ పుస్తకాన్ని అందంగా ముద్రించి యిచ్చిన ప్రింటుషాపు వారికి, సహకరించిన వారికి, దాతలకు, పాఠకులకు అందరికి మా హృదయపూర్వక ధన్యవాదములు.

మీ ఆధ్యాత్మిక సేవలో,

**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు సభ్యులు**

(ప్రకాశకులు)

# వైదిక ఆదర్శ గృహిణి

## శ్రీమతి కుప్పిరెడ్డి ఊర్మిళమ్మ గారి సంక్షిప్త పరిచయం

లోకంలో ఆదర్శ గృహిణులు అనేకమంది ఉంటారు. మరి ఊర్మిళమ్మ గారిలోని ప్రత్యేకత ఏమిటి ?

1. శ్రీమతి ఊర్మిళమ్మ గారు సృష్ట్యాదిలో పరమేశ్వరుడు ఆదిమానవులకిచ్చిన వేదాలకు అనుగుణంగా తాను మారటమే కాకుండా తన భర్తను, సంతానాన్ని వైదికులుగా - వేదమతానుయాయులుగా మార్చారు. కోడలను, అల్లుళ్ళను, మనుమలను, మనురాండ్రను కూడా వేదానుయాయులుగా మార్చారు.

2. వేదం అకారణంగా ఏ ప్రాణిని హింసించవద్దంటుంది. చంపవద్దంటుంది. ఇంతేకాక, ప్రాణులన్నిటీనీ మిత్రదృష్టితో చూస్తూ చేతనైనంత వాటికి ఉపకారం చెయ్యమంటుంది. నిత్యం సంధ్య అగ్నిహోత్ర పితృ అతిథి బలివైశ్వదేవా లనే పంచమహాయజ్ఞాలు చెయ్యమంటుంది. శ్రీమతి ఊర్మిళమ్మ గారు శ్రద్ధతో పంచ మహాయజ్ఞాలను తాము ఆచరించటమే కాక ఆ కుటుంబంలోని వారందరికి వాటిపై శ్రద్ధాభక్తులు కలిగించారు. నిత్యం మాంసాహారం భుజించే ఆ కుటుంబాన్నంతటనీ శాకాహారులుగా మార్చారు. కోడలిని, అల్లుళ్ళను, మనుమలను మనుమరాండ్రను కూడా శాకాహారులుగా మార్చారు. పంచమహాయజ్ఞాలపై శ్రద్ధాభక్తులను కలిగించారు. బంధుమిత్రులలోను పెక్కురను శాకాహారులుగా మార్చారు. అందుకనే నేను వారిని 'వైదిక ఆదర్శగృహిణి' అంటున్నాను. ఇంతేగాక, వీరు చేసిన చేస్తున్న సంస్కరణలు మరెన్నో ఉన్నాయి. సంక్షిప్తంగా.....

1. శ్రీమతి ఊర్మిళమ్మగారు ఒక సామాన్య రైతుకుటుంబంలో శ్రీమతి కౌసల్యమ్మ, శ్రీ వెంకటరెడ్డి దంపతుల ప్రథమ కుమార్తెగా జన్మించారు. ఆ కుటుంబానికి ఒక క్రొత్త వెలుగును తీసుకువచ్చారు.

2. శ్రీమతి ఊర్మిళమ్మగారు తోటి పిల్లలవలెకాక ఆటపాటలతో గడిపే వయసులోనే భగవంతుని పట్ల అచంచలమైన భక్తి విశ్వాసాలు కలిగిఉండేవారు. తన అమ్మమ్మ గారి గ్రామం అన్మాస్‌పల్లి (కర్తాల్)లో తన మేనమామ శ్రీనివాస్ రెడ్డి గారు మరియు వారి స్నేహితులైన నిత్య శుద్ధానంద స్వామిగారు నిత్యం నిర్వహించే గీతాపారాయణం, రామకోటి జపయజ్ఞం, భజనలతో కూడిన సత్సంగంలో పాల్గొనేవారు.

3. వారి 16వ ఏటనే చెన్నారం గ్రామ వాస్తవ్యులైన శ్రీమతి రామచంద్రమ్మ

శ్రీ లక్ష్మీకాంత రెడ్డి గార్ల ప్రథమ కుమారుడైన శ్రీ పెంటారెడ్డి గారితో పెద్దలు వివాహం జరిపించారు.

4. అప్పటి నుండి ఈ పుణ్యదంపతులు ధార్మిక ప్రవృత్తితో పరోపకార పరాయణతతో ఎన్నికష్టాలొచ్చినా ఎదుర్కొంటూ జీవితాన్ని గడుపుతున్నారు. సాధు సత్పురుషుల నాదరించి సేవలు చేస్తున్నారు. అతిథి సత్కారమంటే వీరికి అత్యంత ప్రీతి. ఉమామహేశ్వర క్షేత్రంలో గొప్ప తపస్వియైన శ్రీమాన్ బూరుగు లక్ష్మీనర్సయ్య గారితో వీరికి పరిచయం ఏర్పడింది. వారే వీరికి ప్రథమంగా గాయత్రీ ఉపదేశం చేసి, గాయత్రీ యజ్ఞాన్ని మొదలు పెట్టించారు.

5. వీరు ఆనాటినుండి నిత్యం 108 గాయత్రీ మంత్రాలతో అగ్నిహోత్రం చేస్తున్నారు. దానితో వారిలో జిజ్ఞాస (యింకా యింకా తెలుసుకోవాలనే కోరిక) పెరుగుతూ వచ్చింది. వారు బడిలో చదువుకొన్నది నామమాత్రమే. అయినా చాలా శ్రమించి చక్కగా చదువగల వ్రాయగల సామర్థ్యాన్ని పెంచుకున్నారు

6. అనంతరం శ్రీమాన్ లక్ష్మీకాంతరెడ్డి గారు కొన్ని వేదమంత్రాలను, వాటి అర్థాలను పరిచయం చేశారు. దానితో మరింత జిజ్ఞాస కలిగింది.

7. తదుపరి 1991 సం॥లో సీతాఫలమండి ఆర్యసమాజ మందిరంలో నిర్వహించిన శిబిరంలో పండిత గోపదేవ్ శాస్త్రి గారి ప్రవచనాలు విన్న తరువాత వారికి వేదప్రతిపాదిత దేవుని గురించి బాగా అర్థమయ్యింది. వేదాలలో కేవలం జీవదేవ ప్రకృతుల జ్ఞానమే కాకుండా శారీరక బౌద్ధిక సామాజిక అత్యోన్నతికి కావలసిన విద్యావిజ్ఞానాలు కోకొల్లలుగా ఉన్నాయని గ్రహించారు. నిత్యం కొన్ని మంత్రాలను మనన చింతనలు చేస్తూ వైదిక ధర్మాన్ని గూర్చిన ఎన్నెన్నో విషయాలను గ్రహిస్తున్నారు.

8. అప్పటినుండి తరచుగా వైదిక సత్సంగాలలో పాల్గొంటూ తమ జ్ఞానాన్ని పెంచుకుంటున్నారు. పండిత మాతా నిర్మలయోగభారతిగారి ప్రవచనాలను విన్న తరువాత వారికి గోభక్తి పెరిగింది. అదే క్రమంలో శ్రీ సుభాష్ పాలేకర్ గారి పుస్తకాలు చదివి, విని గో ఆధారిత వ్యవసాయ పద్ధతులను బాగా తెలుసుకున్నారు. ముందు తరాలకు ఈ జ్ఞానాన్ని అందివ్వాలని వారి స్వంత వ్యవసాయ క్షేత్రాన్నే ఒక పరిశోధన కేంద్రాన్ని నెలకొల్పి చక్కటి ఆర్గానిక్ పంటలను పండిస్తున్నారు. ఇంతేగాక, ఎక్కువ దిగుబడిని కూడా సాధిస్తున్నారు. దానితో చుట్టు ప్రక్కల రైతులు వారి

పద్ధతులను అనుసరించి ఆర్థికంగా కూడా రైతులు లాభపడుతున్నారు. అస్తు

(ఆర్గానిక్ పంటలు అంటే - కృత్రిమ రసాయనాలు, కృత్రిమ పురుగు మందులు వాడకుండా పంటలను పండించటం, గో మల మూత్రాల తోనే చీడపురుగులను నివారించటం, పంటలను విషరహితం చేయటం)

ఎంత మాత్రం వ్యవసాయానుభవంలేని వారయినప్పటికి శ్రీమతి ఊర్మిళమ్మ గారు కష్టించి నేర్చుకొని ఇంతటి విజయాలను పొందటం అభినందనీయం. అందుకనే వారిని 'వైదిక ఆదర్శ గృహిణి' అని పేర్కొనటం జరిగింది. మీరెమంటారు ?

వారి కుటుంబ పరిచయం

**శ్రీమతి ఊర్మిళమ్మ శ్రీ పెంటారెడ్డి దంపతుల సంతాన పరిచయం**

1. వీరికి ముందుగా ఒక ఆడబిడ్డ కలిగింది. ఆమె పేరు : శ్రీమతి విజిత భర్తపేరు కీ.శే. మాధవరెడ్డి. వీరికి ఇద్దరు కుమారులు. 1. విజయసేనా రెడ్డి, 2. జయసింహారెడ్డి.

రెండవ సంతానం శ్రీ విజయభాస్కర్ రెడ్డి వీరికి ఇద్దరు కుమార్తెలు వారి పేర్లు అక్షర, సుజన.

మూడవ సంతానం శ్రీమతి ఉదయగీత, భర్త పేరు శ్రీ శ్రీనివాసారెడ్డి ఈ దపంతులకు ఒక కుమారుడు - అభిరాం రెడ్డి.

వీరంతా శుద్ధ శాకాహారులై పెద్దలయెడ విధేయతతో ప్రవర్తిస్తున్నారు. అనుకూల పరివారంతో శ్రీమతి ఊర్మిళమ్మ గారి జీవితం ఆనందంగా గడిచిపోతున్నది. వీరికి మా అభినందనలు.

వీరు మా గాయత్రీ ఆశ్రమ ట్రస్టునకు ఈ "అగ్నిహోత్రం 100 % వైజ్ఞానికం" పుస్తక ముద్రణ వ్యయాన్నంతా దానంగా యిచ్చారు. వీరికి మా హృదయ పూర్వక ధన్యవాదములు. సర్వవ్యాపక సర్వ సంరక్షక సర్వేశ్వరుడు ఈ కుటుంబానికంతటికి ఆయురారోగ్య ఐశ్వర్యాల నిచ్చి సదా కాపాడుచుండును గాక.

**సుమ్నార్థి**

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు

# గ్రంథకర్త తొలి పలుకులు

ఓం   అగ్ని మీళే పురోహితమ్ । యజ్ఞస్య దేవ మృత్విజమ్
హోతారం రత్న ధాతమమ్ ॥   (ఋగ్వేదము : 1-1-1)

ఓ అగ్నీ ప్రకాశ స్వరూప పరమేశ్వర! నీవు పురోహితుడవు. ముందుగానే మా హితాన్ని కోరువాడవు. నీవు సృష్టి, స్థితి, లయము లనెడి యజ్ఞాన్ని చేయు దేవదేవుడవు. ప్రథమ మానవ సృష్టి సమయమున మానవులతోపాటు యజ్ఞ పద్ధతిని సృష్టించిన యజ్ఞదేవుడవు. ఋతు క్రమాన్ని సృష్టించి జీవులకు మేలు చేయు కరుణామయుడవు. జీవులు చేయు కర్మలకు న్యాయంగా ఫలముల నొసగు న్యాయకారివి. జీవుల కల్యాణం కొరకు వేదం ద్వారా విజ్ఞానరత్నాల నుపదేశించిన శివుడవు - కళ్యాణ కారుడవు. అట్టి నిన్ను ప్రప్రథమమున స్తుతించుచున్నాను.

"వసోః పవిత్రమసి శతధారం, వసోః పవిత్రమసి సహస్రధారం"

(యజుర్వేదము. 1-3)

'అగ్నిహోత్రం శత విధాలుగా బ్రహ్మాండాన్ని ధారణచేయును. పవిత్ర మొనర్చును. ఇది సహస్ర విధాల వాతావరణాన్ని శుద్ధి యొనర్చి ప్రాణులకు సుఖాన్నిచ్చు పవిత్ర కర్మ' అని వేదం ద్వార పరమేశ్వరు డుపదేశించెను. ఇట్టివే అగ్నిహోత్రాన్ని గురించి అనేక మంత్రాలు నాలుగు వేదాలందును గలవు.

దీనిని కోరికలు తీర్చు కామధేను వని శ్రీకృష్ణుడు భగవద్గీతలో కీర్తించెను. అగ్నిహోత్ర వాయువులు సూర్యునికి ఇంధనాలుగా మారి తద్వారా వర్షాలు, అన్నము ఉత్పన్నమై ప్రాణులను పోషించుచున్నవని మహర్షి మనువు చెప్పినాడు. అయితే వీటిని వైజ్ఞానికంగా నిరూపించవలసియున్నది. అందుకొరకై ఆర్య విద్వాంసులు చాలా ప్రయత్నించి హిందీ, ఆంగ్ల భాషలలో గ్రంథాలను రచించిరి. అట్టివారిలో ముఖ్యంగా డా॥ సత్యప్రకాశ్, డా. గురుదత్, డా॥ సత్యవ్రత సిద్ధాంతాలంకార్, డా॥ ఫుందన్‌లాల్, పండిత వీరసేన్ వేదశ్రమీ గార్లు పేర్కొనదగినవారు.

విదేశాలలో నేడు అగ్నిహోత్ర ప్రక్రియ విరివిగా ప్రచారం గావింపబడుచున్నది. చిలీ, పోలెండ్, అమెరికా, జర్మనీ దేశాలలో శ్రీ పరంజపే శ్రీ బిథోల్, మోనికా జేహైగ్ మొదలగువారు అగ్నిహోత్రంపై పరిశోధనలు చేయుచున్నారు. వీరి పరిశోధనా వ్యాసాలు 'భారతీయ సత్సంగ్', 'యు.యస్. సత్సంగ్' అను ఆంగ్ల పత్రికలలో ప్రచురింపబడుచున్నవి. కాని, తెలుగు భాషలో అటువంటి సాహిత్యం లేదు. అందుచే తెలుగు పాఠకుల అనుకూలత కొరకు వారి రచనలలోని సారాంశాన్ని ఏకత్రిత పరచి ఈ సంకలన రచనను గావించినాను. నా రచనలో భాషాదోషా లుండవచ్చును. విజ్ఞులు ఆ దోషాలను వదలి విషయాన్ని గ్రహించ గోరదెను.

**– సుమ్నార్థి డా. కోదూరి సుబ్బారావు**

## ఈ పుస్తకాన్ని గురించి

### 'ఆంధ్రప్రభ' సచిత్రవారపత్రిక వారి సమీక్ష

కాలం పెట్టే అగ్ని పరీక్షలకు తట్టుకొని భారతీయ ఆర్షవాఙ్మయం అంత జవంతో, జీవంతో నిల్చి ఉన్నదంటే దానికి కారణం– దాని హృదయం సార్వకాలిక సార్వత్రిక సార్వజనీన వైజ్ఞానిక సిద్ధాంత సారం కావటమే. ఎన్నెన్ని ఖండన మండనలు జరుగుతున్నా, ఎందరెందరు విద్వాంసుల కది విహారభూమి అయినా, ఆ వాఙ్మయం పరిశోధనీయాంశమే అవుతున్నదంటే దాని మహత్తు మానవ మేధకు అతీతంగా భాసిస్తూ ఉన్నదని గ్రహించటమే వివేకం. వైదిక వైజ్ఞానిక విషయ గ్రహణశక్తి లేని ఆలసులు మందబుద్ధులైన సామాన్యులకు ఆత్మ కల్యాణ కామనతో మన ప్రాచీనులేర్పర్చిన సంప్రదాయాల్లో ఎంత పట్టు ఉందో ఇక్కడ నడిచే ఏ పాదమైనా చెబుతుంది. కృతజ్ఞతా భావంతో, వినమ్రభావంతో పంచమహాభూతాలేకాదు! ప్రతి అణువూ దైవస్వరూపంగా, దివ్యంగా, భవ్యంగా, నవ్యంగా ఆరాధన పొందిన భూమి మన భరత భూమి. ఈ భూమికి వేదం వెన్నెముక. ఆ వేద వాఙ్మయానికి–

'ఓం అగ్ని మీళే పురోహితమ్ ।
యజ్ఞస్య దేవ మృత్విజమ్
హోతారం రత్న ధాతమమ్' ॥ (ఋగ్వేదము: 1-1-1)

అనే ఋఋ్మంత్రం శ్రీకారం. అగ్ని లేకపోతే శివం శవమై పోతుందన్న సంగతి తెలుసు. అగ్ని యజ్ఞస్వరూప విరాట్. ఈ యజ్ఞ విద్య మహాభారత యుద్ధానంతరం లుప్తమైపోయింది. జ్ఞానకర్మలు విడివడి శక్తిహీనమై పరిహాసాస్పద దశకు వచ్చేశాయి. ఈ స్థితిని మార్చడానికి వైదిక వైజ్ఞానిక స్వరూప నిరూపణకు ఒక్క మన దేశంలోనే కాకుండా చీలీ, పోలెండ్, అమెరికా, జర్మనీ వంటి దేశాల్లో కూడా తీవ్రమైన ప్రయత్నాలు జరుగుతున్నాయి. అలాంటి ప్రయత్నమే ఈ పుస్తకం. శ్రీ పరంజపే, శ్రీ భిథోల్, మోనికాజేహైగ్, సత్యప్రకాశ్, గురుదత్, సత్యవ్రత్, ఫుందన్‌లాల్ మొదలైన పరిశోధకులకోటికి చెందిన శ్రీ సుబ్బారావుగారు ఆప్తకామనతో ఈ రచన చేయటం ముదావహం.తెలుగులో ఇటువంటి ప్రయత్నం ఇంత వరకు జరుగలేదనే చెప్పాలి.

మన షోడశ సంస్కారాల్లో అగ్నిహోత్రం ప్రధానమైన అంశం. పదార్థ సూక్ష్మీకరణ, దోషహరణ శక్తులుగల అగ్నికి వాతావరణ కాలుష్య నివారణ చేయగల సామర్థ్యమున్న మాట పరమ యథార్థం. అంతేకాదు అంటువ్యాధుల్ని నివారించడం, వర్షాలు కురిపించడం కూడా అగ్ని చేసే పని. భావశుద్ధికి, భౌతిక శుద్ధికి మన ప్రాచీను లెన్నుకొన్న మహాప్రణాళిక అగ్నిహోత్ర నిర్వహణం. దాని ద్వారా 'అగ్నిర్వై దేవానాం ముఖమ్'అను దివ్యత్వాన్ని సాధించిన ప్రాచీన యాజ్ఞికుల ధిషణా సంపదకు భాష్య రూపంగా నేటి సైన్సుకు అనురూపంగా ఈ రచన సాగింది. అగ్నివల్ల కలిగే ఉపయోగాలే కాకుండా యజ్ఞ విద్య వల్ల కలిగే వైజ్ఞానిక లబ్ది కూడా చక్కగా రెండు రెళ్లు నాలుగన్నంత నిక్కచ్చిగా సోదాహరణంగా ఉంది. మన ప్రాచీన వాఙ్మయాన్ని చిన్న చూపు చూసి, చిరునవ్వునవ్వే అత్యాధునిక వైజ్ఞానిక చక్రవర్తులు కూడా ఇటువంటి రచనలు సరదాకైనా ఒక్కసారి చూడటం మంచిది. గుణం ఎక్కడున్నా గ్రహించటం సంస్కారుల లక్షణం కదా!

**(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక (8-6-1988) నుండి)**




## అగ్నిహోత్ర పునరుద్ధారకుడు



మహర్షి దయానంద సరస్వతి



"ఏ మనుష్యుని శరీరమునుండి యెంత దుర్గంధ ముత్పన్నమై వాయు జలములను కలుషితము చేసి, రోగోత్పత్తికి కారణమై, ప్రాణుల కెంత దుఃఖమును కలిగించునో అంత పాపము ఆ మనుష్యునకు కలుగుచున్నది. కాబట్టి ఆ పాప నివారణార్థము అంత కాని, అంతకంటె నధికముగా గాని సుగంధమును వాయు జలములందు వ్యాపింపజేయవలెను. ఒకడు తినగలిగినంత నేతిని, సుంగంధ పదార్థములను హోమము చేయుటచే లక్షల కొలది మనుష్యుల కుపకార మగును."

**– మహర్షి దయానంద సరస్వతి**

(సత్యార్థ ప్రకాశము – తృతీయ సముల్లాసము)

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

## సుమ్నార్థి (డా. కోడూరి సుబ్బారావు) గారి రచనలు

వేదాలలో సూర్యకిరణ చికిత్స(40=00), వేదాలలో జలచికిత్స (20=00), వైదిక క్రాంతి పథం(15=00), అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము(15=00), దౌహృదిని (ఋషుల దృష్టిలో గర్భిణి స్త్రీ) (20=00), అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ (20=00), గర్భాధాన విజ్ఞానము (30=00), మానవ ధర్మము (25=00), అశ్వినీ దేవతలు(20=00), సంధ్యావందనము - వైజ్ఞానిక సమాలోచనము (20=00), అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము (30=00), గంగాధర శివుడు (5=00), గోమాత (30=00), గాయత్రీ విజ్ఞానం (50=00), జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ (60=00), స్వాతంత్ర్య సముపార్జనలో మహర్షి దయానందుడు (4=00), దైనిక అగ్నిహోత్ర విధి (4=00), మన ఇతిహాసం(70=00), మన వేదశాస్త్రాల పరిచయం (50=00), చతుర్దశ భువనములు (10=00), ఐతరేయోపనిషత్తులోని సృష్టికథ (10=00), వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమం (10=00), మరణానంతరం జీవుని ప్రయాణం (40=00), ప్రణవ స్తోత్రము (10=00) చతుర్వేద సరస్వతీ సూక్తము (10=00), వేదాల వెలుగుచూపే ఆర్యసమాజం (20=00), పెండ్లినాటి ప్రమాణాలు (40=00). పురుష సూక్తము (20=00), అగ్నిహోత్రం 100% వైజ్ఞానికం (60=00), శివరాత్రి రహస్యం (3=00). వేదాలలో వర్షేష్టి విజ్ఞానం (25=00), ఈశావాస్యమిదం సర్వమ్ (35=00), వైదిక శాంతిపాఠం (వైజ్ఞానిక వ్యాఖ్య) (20=00), పండుగల పరమార్థం (40=00). వైదిక జన్మదిన వేడుక (30=00) వైదిక గృహప్రవేశ విధి (30=00)

**ఇతర విద్వాంసుల రచనలు :**

యుగపురుషుడు శ్రీకృష్ణుడు (8=00), వైదిక వివాహ వైశిష్ట్యము (8=00), ధర్మవీర్ పం. లేఖరాం(3=00), మహర్షి మనువుపై విరోధమెందుకు (3=00), వేదాలలో అప్సరస గంధర్వులు (2=50), దిగ్రేట్ గాయత్రీ(2=00), వైదిక అర్థనీతి (2=00), బ్రహ్మచర్య విజ్ఞానము (15=00), స్వరాజ్యసంగ్రామములో ఆర్యసమాజము(8=00), సత్యధర్మవిచారణ(6=00), మాతా పుత్రికల జ్ఞానచర్చ (60=00)

(AS ON 31-7-2015)



# అగ్నిహోత్రం 100% వైజ్ఞానికం

## అగ్నిహోత్ర గణపతి

భారతీయ-వైదిక సంస్కృతిలో అగ్ని హోత్రానికి ఒక ప్రత్యేక స్థానం ఉంది. ఆర్యులు జరుపుకొనే గర్భాధాన, పుంసవన, సీమంతోన్నయన, నామకరణ, ఉపనయన, వివాహాది పదునారు సంస్కారాలలో అగ్నిహోత్రమే ప్రధానాంశం. గృహస్థులు విధిగా ప్రతినిత్యం ఆచరించవలసిన పంచమహాయజ్ఞాలలో రెండవది అయిన దేవయజ్ఞం అగ్నిహోత్రమే. ఈ దేవయజ్ఞాన్ని - అగ్నిహోత్రాన్ని ఉదయ సాయం కాలాలలో - సూర్యోదయ, సూర్యాస్తమయ సమయాలలో విధిగా చేయవలెనని మన్వాది ఋషుల ఆదేశం. కేవలం గృహస్థులే గాక బ్రహ్మచారులు, వానప్రస్థులు కూడా ఈ అగ్నిహోత్రం చేయవలసి ఉంటుంది. సంన్యాసులు ధర్మ ప్రచారం చేయుచు దేశసంచారం చేస్తారు గాన వారికి సడలింపు యిచ్చుట జరిగింది. వారి జీవనమే యజ్ఞమయం. అందుచేతనే వారు అగ్నిహోత్ర రంగుగల కాషాయవస్త్రాలు ధరిస్తారు. నిత్యాగ్నిహోత్రాలే గాక ఏ శుభకార్యం జరిపినా ప్రాచీన ఆర్యులు అగ్నిహోత్రంతోనే ప్రారంభించేవారు. ఇది దేవపూజగా ప్రాచీనకాలంలో వ్యవహరింప బడేది. దానికి బదులుగా నేడు లోకంలో గణపతి పూజతో శుభకార్యాల ప్రారంభిస్తున్నారు. ఇది వైదిక సంప్రదాయం కాదు.

ఆలోచించి చూస్తే - గణపతిని సంబోధించే వివిధ నామాలు అగ్నిహోత్ర ఫలితాలనే సూచిస్తాయి. గణపతి ఆకారం కూడ హోమకుండాన్నే పోలిఉంటుంది. అగ్నిహోత్ర లాభాలను తెలుపుటకు ఎవరో కళాకారులు

ఒక వ్యంగ్య చిత్రం (కార్టూన్) గా గణపతి ఆకారాన్ని గీసినారేమో నని అనిపిస్తున్నది. ఏలనన గణపతికి 'రక్తవర్ణుడు' అని పేరు. అగ్నిహోత్రం ఎట్టని రక్తపు రంగు కలిగిఉండటం అందరెరిగినదే. మరియొక పేరు 'లంబోదరుడు'. అనగా పెద్దకడుపు కలవాడని అర్థం. పృథివ్యాది పంచభూతాలలో అగ్నికి మాత్రమే ఎంత హవ్యం వేసినా తిని - భస్మం చేసి జీర్ణం చేసుకొను శక్తి ఉంది. అందుచేతనే అగ్నిహోత్రం లంబోదరుడు. ఈ అగ్నిశిఖలు సరళంగా కాక వంకర టింకరలుగా ఉంటాయి. అందువలన గణపతికి 'వక్రతుండు' డని మరియొక నామం చేర్చారు.

ఇక 'ధూమకేతు' సంబోధనను పరిశీలిద్దాము. 'ధూమకేతు' డనగా ధూమాన్ని - పొగను కేతువుగా - పతాకంగా గలవాడని అర్థం. దూరం నుండి ఒక కార్యాలయాన్ని దానిపై నుండే జెండాను బట్టి గుర్తిస్తాము. అట్లే ఎక్కడైనా దూరంగా పొగ కనబడితే అచట అగ్ని ఉన్నట్లు అనుమాన ప్రమాణంతో నిర్ధారిస్తాము. గాన, అగ్నికి ధూమం పతాకంగా ఉంటుంది. అగ్నిగాక మరి ఎవరు ధూమాన్ని కేతువుగా - పతాకంగా కలిగిఉంటారు? గణపతి ద్విమాత్రుడు. ఇద్దరు తల్లులు కలవాడని కొన్ని పురాణాల కథనం. రెండు అరణుల లేదా రెండింటి రాపిడివలన మాత్రమే అగ్ని పుట్టటం మన నిత్యానుభవమే.

గణపతికి 'మూషికవాహను'డని మరియొక నామం. ఉపనిషత్తుల ననుసరించి భూమి సూర్యునినుండి విడిపోయినప్పుడు భూమిపై అగ్ని ఉండె కాలక్రమంలో ఆ అగ్ని మూషికం వలె భూమిలోనికి ప్రవేశించింది. అదే వృక్షాదులలో అవ్యక్తంగా ఉండి అవి ఎండి అగ్ని సంపర్కం కలిగినపుడు బహిర్గతమౌతూవుంటుంది. గాన, అగ్ని మూషికాన్ని-అనగా భూఅంతర్గత అగ్నిగల పదార్థాలను కట్టెలు మొదలగు వానిని వాహనంగా - ఆధారంగా కలిగిఉంటుంది. గణపతి 'మహాదేవుని కుమారు' డను మాటలుకూడా అగ్నిహోత్రానికే వర్తిస్తాయి. వేదాలలో సూర్యునికి 'మహాదేవు' డని పేరు. అగ్ని సూర్యుని నుండి ఉత్పన్నమైనదే గాన గణపతి (అగ్నిహోత్రం) మహాదేవుని కుమారుడే. ఇట్లు ఆలోచించిస్తూ పోయినచో గణపతి నామాలలో అగ్నిహోత్ర

గుణగణాలే మనకు గోచరిస్తూ ఉంటాయి.

మహాభారత యుద్ధానంతరం లోకంలో వేదధర్మ ప్రచారం లోపించి యజ్ఞయాగాదులలో భ్రష్టాచారాలు నెలకొన్నాయి. యజ్ఞశాలలు కబేలాలుగా, మద్యశాలలుగా మారిపోయాయి. వేదాల పేరుతో అనేక జంతువులను బలియిచ్చి ఆ మాంసాన్ని ఆహుతులుగా ఇచ్చేవారు. కొంత లోనికి సేవించేవారు. సోమరసం పేరుతో మద్యపానం చేసేవారు. మహాత్మ బుద్ధుడు మొదలైన వివేకవంతులు ఈ క్రియలను నిరసించుట జరిగింది. ఆనాడు శుద్ధమైన వైదిక యజ్ఞ విధానాన్ని వివరింప సమర్థులైన ఋషిమునులు లేకుండుటచే యజ్ఞయాగాదులపట్ల సామాన్య ప్రజలకు ఏవగింపు కలిగింది. అట్టి స్థితిలో అగ్నిహోత్రానికి బదులుగా గణపతి పూజ ప్రారంభింపబడి ఉండవచ్చును. అలంకార రూపంలో వర్ణింపబడిన అగ్నిహోత్ర గుణగణాలకు రూపకల్పనచేసి ఆకృతిని కల్పించి గణపతి విగ్రహాలు నిర్మింపబడి యుండవచ్చును. తదుపరి వాటి పూజ ఆరంభమయ్యింది. ఏమైనను అసలైన అగ్నిహోత్రంలో వేయబడిన హవ్యాలవలన కలుగు లాభాలు ఈ విగ్రహ పూజల వల్ల ఎట్లు కలుగుతాయి? ఇంతేగాక, ప్రాచీన వేద శాస్త్రాలలో, గృహ్యాసూత్రాలలో, రామాయణ భారతాది ఇతిహాస గ్రంథాలలో వివిధరకాల యజ్ఞయాగాదుల వర్ణన కనబడుతుందిగాని గణపతి పూజ కానరాదు.

## అగ్నిహోత్రం - దేవపూజ

ప్రాచీనకాలంలో అగ్నిహోత్రాన్నే దేవపూజ అనేడివారు. దేవత లంటే దివ్యగుణాలు గలవారని అర్థం. వారిని వర్గాలుగా విభజించవచ్చును. ఒకటి - చేతన దేవతలు, రెండు-జడ దేవతలు. తల్లి, తండ్రి, గురువు, అతిథులు.(సాధుసంన్యాసులు), దానశీలురు, పరోపకార పరాయణులు, విద్వాంసులు మొదలగువారంతా చేతన దేవతలు. అనగా జ్ఞానం గల దేవతలు. వీరేగాక జ్ఞానం లేనివైన పృథి వ్యాప స్తేజో వాయు రాకాశా లను పంచభూతాలు; సూర్య చంద్ర గ్రహ నక్షత్రాదులు కూడా దేవత లని చెప్పవచ్చును. ఏలనంటే ఇవి ప్రాణి మనుగడకు ఆధారంఔతున్నాయి. వీటివలననే ప్రాణుల శరీరాలు నిర్మింపబడి పోషింపబడుతున్నాయి. గాన ఇవి జడ (జ్ఞానరహిత) దేవతలు.

ముఖ్యంగా అగ్నిహోత్రంవల్ల ఈ జడ దేవతలు పూజింపబడతారు.

పూజ అంటే ఏమిటో కూడా వివరింపవలసింది. ఏలనన నేడు 'పూజ' అనే పదం విగ్రహాలకు పసుపు కుంకుమలతో చేయు క్రియాకలాపాలకే రూఢిగా - పరిమితంగా వాడటం జరుగుతోంది. పూజ అనే పదమునకు సత్కారం, అలంకారం, సంస్కరణం అని కూడా అర్థాలున్నాయి. తల్లిదండ్రులను, పెద్దలను పూజించుట అంటే వారిని సత్కరించటం, గౌరవించటం, ఆహారాదులతో తృప్తిపరచటం, వారి ఆజ్ఞాదులను పాలించటం ఔతుందికాని విగ్రహాదుల పూజవలె కాదు. గడపపూజ అంటే గడపను అలంకరించటం అని అర్థం. అట్లే పూజ పదమునకు సంస్కరించటం, శుద్ధిచేయటం అని కూడా అర్థం చెప్పవచ్చును. భూమిపూజ అంటే భూమిని శుద్ధం చేసి నిర్మాణానికి లేదా వ్యవసాయానికి సిద్ధం చేయటం అని అర్థం.

మన శరీరాలు పంచభూతాలతో నిర్మింపబడ్డాయి. వాటివలననే పోషింపబడుచు జీవించుచున్నాయి. జీవన విధానంలో మన శరీరాలనుండి వెలువడే మలినాల ద్వారా అవి కలుషిత మవుతూవుంటాయి. ఎట్లన-భూమి ప్రసాదించిన మంచి ఆహారాన్నితీసుకొని కొంత మలంగా విసర్జిస్తాం. మంచినీరు త్రాగి మూత్రంగా, స్వేదంగా విసర్జిస్తూవుంటాం. మంచి గాలిని పీల్చుకొని కార్బన్ డైఆక్సైడ్‌తోను, ఇతర మలినాలతోను కూడిన గాలిని వదలి పెడుతూవుంటాం. అందుచే భూ జల వాయువులు - తద్వారా వాతావరణ మంతా కలుషితమవుతూవుంటుంది. మనము ఎన్ని జాగ్రత్తలు పాటించినను వాతావరణం కొంత కలుషితం కాక తప్పదు. అట్టి కాలుష్యాన్ని శుద్ధిచేయవలసిన బాధ్యత మనపై ఉంది. దీనినే మన ఋషులు దేవఋణంగా - జడదేవతాఋణంగా పేర్కొన్నారు. అట్టి ఈ ఋణాన్ని తీర్చుకొనవలసిన బాధ్యత మనపై నున్నట్లు తెలుపుటకే యజ్ఞోపవీతంలోని రెండవ ప్రోగును ఏర్పాటుచేస్తారు. మొదటి ప్రోగు మాతా పితరుల ఋణాన్ని, మూడవ ప్రోగు ఋషుల - జ్ఞానదాతల ఋణాన్ని గుర్తుచేస్తుంది. ఈ దేవఋణ మెట్లు తీరును?.......... అది అగ్ని హోత్రంవలననే సాధ్యమౌతుంది. మరియొక మార్గం లేదు. ఏలనన కాలుష్యాన్ని సంస్కరించే శక్తి అగ్నికి మాత్రమే ఉంది.

విశేషంగా అగ్నిహోత్రంలో వేయు ఘృతమూలికాదులవలన గొప్ప సంస్కరణశక్తిగల వాయువు ఉత్పన్నమగును. ఈ విషయం ముందుపుటలలో వివరంగా తెలిసికొందము.

ముఖ్యంగా అగ్నిలో వేసిన పదార్థాలు వాయువుగా పరిణతి చెంది వాయువును సంస్కరించును. కొంతభాగం మేఘాలవరకు పోయి మేఘములందలి జలాన్ని సంస్కరించును. అవి వర్షించినపుడు భూమిని, యందలి జలాన్ని సంస్కరించును. తద్వారా స్థావర జంగమ ప్రాణులన్నియు సంస్కరింపబడును. మిగిలిన భూ జల వాయు రాకాశ దేవతలలో అట్టి శక్తి లేదు. అందువలన **'అగ్నిర్వై దేవానాం ముఖమ్'** అని ఋషుల నిర్వచనం, అనగా జడదేవతలన్నిటికి అగ్ని ముఖమ్ = నోరు వంటిదని అర్థం. నోటిద్వారా గ్రహింపబడిన ఆహారం జీర్ణింపబడి, రస రక్త ధాతువులుగా మారి శరీరాని కంతటకు పంచబడును. అట్లే అగ్ని యను నోటి కందించిన ఆహుతులు వాయు రూపాన్నిచెంది సమస్త భూతాలకు అందించబడును. ఈ కారణం చేతనే యజుర్వేదం అగ్నిహోత్రాన్ని 'భువనస్య నాభిః' అని వర్ణించును. అనగా మన శరీరంలో నాభివద్ద జరుగు ఆహార స్వీకరణ క్రియ వలన శరీర మంతా పోషింపబడునట్లే అగ్నిహోత్రంలో ఉత్పన్నమగు వాయువుల, పరమాణుశకలాల వలన భువనములు – సూర్య గ్రహ ఉపగ్రహాదులు సంస్కరింపబడుచుండును. అందుచేతనే అగ్నిహోత్రాన్ని దేవపూజా సాధనంగా–దేవఋణవిముక్తి సాధనంగా ఋషులు ఎంచుకొనిరి. ఇంతేగాక, ఆర్య సంస్కృతికి – సంస్కారాలకు అగ్నిహోత్రం ఆత్మవంటిదని చెప్పవచ్చును.

## ద్రవ్యం మార్పు చెందునేగాని నశించదు

నేడు మనం వసించు యుగం వైజ్ఞానిక యుగం. ప్రతి పదార్థాన్ని, క్రియను వైజ్ఞానికదృష్టితో పరిశీలించుట జరుగుచున్నది. అట్లే ప్రతి ఆచారానికి వెనుక ఏవైనా వైజ్ఞానిక రహస్యాలు కలవేమోనను పరిశోధనలు కూడా జరుగుచున్నవి. వాటి వెనుక ఏవైనా వైజ్ఞానిక రహస్యాలు బయటపడినచో వానిపై మనకు శ్రద్ధ కలుగుచున్నది. కొలదిగా నున్న శ్రద్ధ ఇనుమడించుచున్నది. అగ్నిహోత్రం పూర్తిగా ఒక వైజ్ఞానిక ప్రక్రియ. సామాన్య జనులకు దీనియొక్క

వైజ్ఞానిక స్వరూపం తెలియకపోవుటచే దీనిపై శ్రద్ధ కలుగుట లేదు. విద్యావంతులు కూడా దీనిని ఒక ప్రాచీన ఆచారంగానే తలంచుచున్నారు. ఇప్పుడిప్పుడు ఆంధ్ర, ఆంగ్ల, ప్రాంతీయ భాషాపత్రికలలో అగ్నిహోత్ర లాభాలను గూర్చిన వ్యాసాలు ప్రచురింపబడుచుండుట ముదావహం. కాని, వీనిని గ్రహించి ఆచరించువారు కొందరే. మిగిలినవారంతా కుతూహలంతో చదువుటయే జరుగుచున్నది. ఇప్పటికీ మానవతావాదులమని చెప్పుకొను ఆధునిక హేతువాదులు దీనిని నిరసించుచునేయున్నారు. ధర్మం పేరిట పుష్టికరమైన నెయ్యి మొదలగు పదార్థాలను అగ్నిలోవేసి నాశనం చేస్తున్నారని వారి వాదన. కనుక, దీని వైజ్ఞానిక స్వరూపం వెల్లడి యగుటకు మరెంతో ప్రచారం అవసరం.

రసాయన శాస్త్రంలోని "ద్రవ్య నిత్యత్వ సూత్రము" ననుసరించి సృష్టిలో ఏ పదార్థమూ నశించుట లేదు. అనగా లేకుండా పోవుటలేదు. కాని, మార్పుజెందుచున్నది. అందుచే నాశన మనగా మార్పుజెందుట అని అర్థం చెప్పవచ్చును. అగ్నిలో వేసిన పదార్థం కూడ నశించుటలేదు. మార్పు చెందుచున్నది. అట్టి మార్పు మనకు ప్రయోజనకారి యైనచో దానికి స్వాగతం పలుకవలసినదే. అగ్నిలో వేసిన పదార్థం ఏమగునో ఒకసారి పరిశీలింతము. రండు.

అగ్నిలో ఏదైనా పదార్థం వేసినపుడు అది సూక్ష్మీకరింపబడి వాయువులో కలియుచుండుట మనందరకు అనుభవైకవేద్యమే. ఒక మిరపకాయ అగ్నిలో వేసిన దాని సూక్ష్మాణువులు గాలిలో వ్యాపించుటవలన మనకు ఘాటు (గొట్టు) వచ్చి బాధ కలుగును. సాంబ్రాణి, గుగ్గిలం మొదలగు ద్రవ్యాలను అగ్నిలో వేసిన వెంటనే ఆ సుగంధము చుట్టుప్రక్కల వ్యాపించును. అగరువత్తులను (ఊదుబత్తీలను) వెలిగించినప్పుడే వాటి సువాసనలు వెలువడును. చివరకు దోమలను వెడలగొట్టు "టార్‌టాయిస్ కాయిల్" మొదలైనవియును వెలిగించినప్పుడే వాటి ప్రభావం కనపడును. అట్లే, అగ్నిలో వేసిన నెయ్యి మొదలైన హోమద్రవ్యాలన్నీ గాలిలో వ్యాపించి సువాసనలు వెదజల్లుటయే గాక వాతావరణంలో ఎన్నెన్నో గొప్ప మార్పులు కలిగించుచున్నవని నేటి

పరిశోధనలు వెల్లడించుచున్నవి. అగ్నికి పదార్థాలను సూక్ష్మీకరించు శక్తి అధికంగా ఉన్నది. కనుక అగ్నిలో వేసిన పదార్థం నశించక పరమాణువులుగా విడివడి గాలిలో కలియుచున్నదని అంగీకరించవలెను.

సృష్టిలో ఏ పదార్థమూ నశించదని, కేవలం మార్పుమాత్రమే జెందునని నేటి వైజ్ఞానికులే కనుగొనిరని పెక్కురు తలంతురు. కాని అతి ప్రాచీనమైన భారతీయ విజ్ఞాన గ్రంథాలలో, దర్శనాలలో చివరకు భగవద్గీతలో కూడ ఈ పరిణామ సిద్ధాంతం చెప్పబడినది. భగవద్గీతలో శ్రీకృష్ణుడు ఈ విషయాన్ని చక్కగా వివరించియున్నాడు-

శ్లో.. "నాసతో విద్యతే భావో నా భావో విద్యతే సతః,

ఉభయో రపి దృష్టోఽ న్తస్త్వనయో స్తత్త్వదర్శిభిః" (గీ. 2.-16)

"ఓ అర్జునా! అసత్తునకు భావంకాని, సత్తునకు అభావంకాని యుండదు. అనగా లేనిదానికి పుట్టుకగాని ఉన్నదానికి నాశనంగాని (లేకుండా పోవుటగానీ) జరుగదు. ఈ రెంటియొక్క సిద్ధాంతం తత్త్వజ్ఞులచే చూడబడినది."

అయితే ఆ పరిణామం మనకు ప్రయోజనకారిగా నుండవలెను. అందువలన ఏ పదార్థాలు అగ్నిలో వేసిన బహుళ ప్రయోజనకారి యగునో అట్టి పదార్థాలనే అగ్నిలో వేసి లాభం పొందాలి. హాని కలిగించు పదార్థాలను అగ్నిలో వేయరాదు. అగ్నిలో ముఖ్యంగా రెండు గుణాలున్నవి. ఒకటి దోషహరణశక్తి. రెండవది సూక్ష్మీకరణ శక్తి. పదార్థాలలో గల దోషాలను పోగొట్టుటకు లోహాలు మొదలగు వాటిని అగ్నిలో కాల్చుదురు. చెత్త మొదలగు వాటిని తగులబెట్టి వాటివల్ల చెడుగు కాకుండా జాగ్రత్త పడుదురు. దానితో బాటు వస్తువులను సూక్ష్మాణువులుగా విభజించగలశక్తి అగ్ని కున్నది. బంగారం మొదలగు లోహాలను కూడ అగ్ని భస్మాలుగా మార్చగలదు. ఇట్టి శక్తిగల అగ్నిని మన ప్రాచీన ఋషులు వాతావరణాన్ని శుద్ధిచేయు ప్రయోగశాలగా (పరికరంగా) రూపొందించిరి. అదియే అగ్నిహోత్రం. ముఖ్యంగా నెయ్యి, ఓషధులను అగ్నిలో వేయుట వల్ల సామాన్యంగా వాటిని వాడుకున్న దానికన్న విశేష ప్రయోజనం కలుగుచున్నదని వారు గుర్తించిరి.

ఓషధులు (మందులు) కూడా సూక్ష్మీకరించబడినపుడే వాటి గుణం వృద్ధియగును. ఈ సూత్రం హోమియోపతి ఔషధాలలో వెల్లడియగును. ఔషధాలయొక్క రసాలను పలుచన (Dilute) చేయుకొలది వాటి ఓషధీశక్తి వృద్ధి యగుచుండును. అందుచే వాటిని Dilutions అని పిలిచెదరు. ఆయుర్వేదంలో లోహాలను భస్మంచేసి ప్రయోగింతురు. పుటాలుపెట్టి భస్మమైన వాటిని మరల మరల పుటాలలో భస్మీకరించి ప్రయోగింతురు. శతపుట భస్మం కన్న సహస్రపుట భస్మం ఎక్కువ గుణకారిగా నుండును. అనగా సూక్ష్మాతి సూక్ష్మ అణువులుగా మారుచున్నప్పుడే వాటి గుణం వృద్ధియగుచున్నట్లు విశదమగుచున్నది. ఇందుకు మరికొన్ని ఉదాహరణలు చెప్పవచ్చును. మనం నిత్యం భోజనంలో ఉప్పును వాడుచుందుము. ఆ ఉప్పునే హోమియోపతి వైద్యులు క్రమపద్ధతిలో అతిగా పలుచనచేసి మందుగా వాడుదురు. అదే 'నేట్రం మూర్'. అప్పుడది సమాన లక్షణాలను పుట్టించగల తరుణ, దీర్ఘవ్యాధులను సమూలంగా పోగొట్టు శక్తి కలిగిన దగుచున్నది.

మనం నిత్యం ఉప్పు తినుచున్నప్పటికి పొందలేని ప్రయోజనాన్ని అతిగా పలుచన చేయబడిన ఉప్పు కలిగించుచున్నది. ఉదాహరణకు ఎండదెబ్బకు 'నేట్రం మూర్' ఒక మందు. వేసవిలో ఎండలో వెళ్ళినప్పుడు కొందరికి ఎండదెబ్బ తగులుచున్నది. వారికి 'నేట్రం మూర్' 200c వేసిన వెంటనే ఎంతో ఉపశమనం కలుగును. వారు అంతకుముందు భోజనంలో ఉప్పు వాడియుండిరి. అయినప్పటికి ఎండదెబ్బ తగిలినది. ఆ ఉప్పునే సూక్ష్మరూపంలో ప్రయోగించుట వలన గొప్ప మేలు జరిగినది. ఎండదెబ్బ తగిలినవారికి గ్లూకోజు నీరుకన్న కొబ్బరి నీరు దివ్యౌషధము. ఎందుకనగా దానిలో నున్న గ్లూకోజుయేగాక సూక్ష్మరూపంలో నున్న ఉప్పే అందుకు కారణం.

హోమియోపతి వైద్యులు లైకోపోడియమ్ అను మూలికను మందుగా వాడుదురు. ఇది అల్లోపతి వైద్యుల దృష్టిలో ఏ రకమైన ఓషధీ గుణాలు లేనిది (Inert-Substance). అందుచేత మందు మాత్రలు ఒకదానితో నొకటి అంటుకొని పోకుండా నుండుటకు దీనిని వాడుదురు. దీనిని హోమియోలో పలుచన చేయగా కొన్ని బలమైన గుణాలు కనబడినవి. వారి చికిత్సాసూత్రం

ప్రకారం లక్షణ సారూప్యతగల రోగులకు దీనిని ఔషధరూపంగా ఇచ్చి ఎన్నో దీర్ఘ వ్యాధులను సమూలంగా పోగొట్టిరి. అట్లే ఇసుక (Silicea), బొగ్గు(Carbo veg), మట్టి (Alumina).... మొదలైనవి సూక్ష్మీకరించినపుడు (పలుచన చేసినపుడు) గొప్ప ఔషధాలగును.

## సూక్ష్మ రూపంలో నున్న ఔషధాలు శరీరారోగ్యంపై పనిచేయు విధం:

ప్రతి మానవుని ఊపిరితిత్తులు దగ్గరగా ముడుచుకుపోయిన గాలి తిత్తుల సమూహం. వాటినిండా గాలి పూరించిన 230 ఘ॥ అంగుళాల విస్తీర్ణం గల గాలిని నింపవచ్చును. కాని, ఛాతీలో వైశాల్యం తక్కువగా నుండుటవలన కొద్దిగాలి మాత్రమే మనం నింపుకొన గలుగుచున్నాము. ప్రాణాయామాది అభ్యాసాల ద్వారా ఈ శక్తిని మరికొంత పెంచుకొనవచ్చును. సామాన్యంగా మనం ఉచ్ఛ్వాస నిశ్వాసాలు చేయునపుడు 20-30 ఘ॥ అంగుళాల గాలి మాత్రమే లోనికి పోవుచు వచ్చుచుండును. ప్రాణాయామ అభ్యాసం చేయువారు క్రమంగా 130 ఘ॥ అంగుళాల వరకు గాలి పీల్చుకొన గలుగుదురు. అంతేగాక, ప్రాణాయామం వలన ఊపిరితిత్తుల పైభాగం, క్రింది భాగాలలోనికి గాలి పోయివచ్చుచుండుట వలన అవి పరిశుభ్రమగును. మనం పట్టణ మధ్య నుండి సముద్రతీర ప్రాంతాలకు లేదా పర్వత ప్రాంతాలకు వెళ్ళినపుడు మన కొకరకమైన సుఖానుభవం కలుగును. దీనికి కారణం అక్కడ గాలిలో ఎక్కువ ఆక్సిజన్ ఉండుటయే. ఆట్లే అగ్నిహోత్రం దగ్గర కూర్చున్నప్పుడు ఔషధీయుక్తమైన వాయువులు మన ఊపిరితిత్తులలో ప్రవేశించి మనకు సుఖానుభూతి కలుగును. ఆ వాయువులు రక్తంలో కలిసి శరీరమంతటా సంచరించి అనేక రోగాలను పోగొట్టగల అవకాశమున్నది.

ఈ మంచి గాలితోబాటు కొంత కార్బన్‌డైఆక్సైడ్‌కూడా మంటలనుండి వెలువడుచుండును. అందుకే, కొందరు మంటల సమీపాన కూర్చుండుట హానికర మని వాదింతురు. ఇది అనారోగ్య కరమని వారి అభిప్రాయం. సృష్టిలో ఈ కార్బన్‌డైఆక్సైడ్ అవసరం కూడా ఉన్నది. వృక్షాలకు ఇది ఆహారాన్ని

సిద్ధపరచుకొనుటలో సహాయపడును. సూక్ష్మీకరించిన పదార్థాలను అగ్ని దూర దూర ప్రాంతాలకు, పైకి వ్యాపింప చేయునది ఈ వాయువే. ఇది మన మనుకున్నంత హానికరమైనది కాదు. మనం వాడే సోడా, కోకోకోలా, ఫాంటా మొదలగు పానీయాలలో ఇది ఉండును. ఈ పానీయాలు త్రాగినప్పటికిని మనకు హాని కలుగుట లేదు గదా! మనం అగ్ని హోత్రం చేయునపుడు వెడలు ఈ కొద్ది కార్బన్‌డైఆక్సైడ్‌కు భయపడ నేల? అంతేగాక, మనం అగ్ని హోత్రంలో ఎన్నో మంచి పదార్థాలను, ఆరోగ్యాన్ని బలాన్ని యిచ్చు ఓషధులను వేయుచున్నాము. హోమంలో కస్తూరి, అగరు, చందనం, యాలకులు, జాజికాయ, జాపత్రి, తులసి, కర్పూరం మొదలైన సుగంధ ద్రవ్యాలను కూడా వేయుచుందుము. అందువలన ఎట్టి హానియు జరగదు.

పెద్ద పెద్ద యజ్ఞాలు చేయునపుడు కొంత అధికంగా కార్బన్‌డైఆక్సైడ్ వెడలును. అది ఓషధులను పైకి తీసుకువెళ్ళి మేఘాల నాకర్షించి వర్షాన్ని కురిపించును. అప్పుడప్పుడు అడవులలో అగ్నిజ్వాలలు వ్యాపించి అడవులు తగలబడుచుండును. అప్పుడు టన్నుల కొలది కార్బన్‌డైఆక్సైడ్ ఉత్పన్నమగును. ఆ కార్బన్‌డైఆక్సైడ్ పైకి వెళ్ళి మేఘాల నాకర్షించును. కొద్దిసేపటిలో వర్షం పడును. అటవీ ప్రాంతంలో నున్నవారి కిది అనుభవ సిద్ధమైన విషయమే. వారు అడవి తగులబడుచున్నప్పుడు చూచి వర్షం పడునని జోస్యము చెప్పుదురు. అంతేగాక, అగ్నిహోత్రంలో వేసిన కొన్ని ఓషధుల ప్రభావం వల్ల ఈ కార్బన్‌డైఆక్సైడ్ కొన్ని మార్పులు చెంది "ఫార్మాల్‌డీహైడ్" గా మారునని డాక్టర్ సత్యప్రకాశ్ గారు తమ 'అగ్నిహోత్ర' మను గ్రంథంలో చెప్పియున్నారు. (To some extent even Carbondioxide is also reduced to formaldehyde.)

కొందరికి మరియొక సందేహం కలుగును. "ఈ రోజులలో నెయ్యి మొదలైన పుష్టికర పదార్థాలు తినుటకే దొరుకుట లేదు కదా! అగ్నిలో వేసి వ్యర్థం చేయుట భావ్యమా?" అని. ఈ సందేహం తీరుటకు మనం కొన్ని విషయాల నాలోచించవలసి యున్నది. మనం భుజించు నెయ్యి అంతా అగ్నిలో వేయనక్కరలేదు. కొద్ది నెయ్యిని ఔషధంగా మార్చుటకు అగ్నిలో వేసిన చాలును.

ఔషధులు కూడా కొద్దిగా వేసిన చాలును. మహర్షి దయానందుడు పూనాలో చేసిన ప్రవచనాలలో ఈ విధంగా హెచ్చరించెను. "ఒకేసారి మణువుల కొలది నేతిని సంవత్సరాల పొడుగున అగ్నిలో వేయుచుండుట హోమం కాదు. యోగ్యమైన రీతిలో విధిని అనుసరించి హోమం చెయ్యా"లన్నారు. ఇది మనం కొన్ని ప్రయోజనాలను కోరుచు చేయుచున్నామే కాని ధర్మం పేరిట గ్రుడ్డిగా చేయటంలేదు. అగ్నిహోత్రం వలన ప్రధానంగా నాలుగు ప్రయోజనాలు కలుగును. అవి -

1. గృహం, దాని పరిసర వాయుమండలం శుద్ధ మగును.

2. అంటువ్యాధుల నివారణ, నిరోధాలు జరుగును.

3. వివిధ రకాల వ్యాధులను పోగొట్టుటకు, ఆ సూక్ష్మజీవులు వృద్ధి పొందకుండుటకు సహకరించును.

4. వర్షాలు అవసరమైనపుడు కురిపించుటకు, అధిక వర్షాలను తగ్గించుటకు, సంతానప్రాప్తి, రోగ నివారణ మొదలగువాటికి తోడ్పడును. వీటిని గురించి వివరంగా తెలిసికొందాము.

1. గృహము, దాని పరిసర వాయుమండలం శుద్ధ మగును:

మానవుడు సామాజిక ప్రాణి. గృహస్థుడుగా గ్రామాలను, పట్టణాలను నిర్మించుకొని జీవించును. అటువంటి గ్రామాలలోని, పట్టణాలలోని ఇండ్లలో కార్బన్‌డైఆక్సైడ్ అధికంగా చేరును. దానితోబాటు దుర్గంధం కూడ నుండును. వీటివలన అనేక రోగాలు వచ్చు అవకాశమున్నది. మనమెంత పరిశుభ్రంగా నున్నప్పటికి మన శరీరాలనుండి వెలువడు మలినాల ద్వారా వాతావరణం కొంత మలిన మగుచుండును. అందుచే, ఈ వాతావరణాన్ని పరిశుభ్రపరచు బాధ్యత మనపై నున్నది. మన గృహాల్లో అగ్నిహోత్రం చేయుట వలన మన గృహంలోని వాయువొక్కటేగాక చుట్టు ప్రక్కల వాతావరణం కూడా కొంతవరకు పరిశుద్ధ మగును. ప్రతి యింట అగ్నిహోత్రం జరిగినచో ఆ ప్రాంతమంతా పరిశుద్ధ వాయువుతో నిండును.

మనం ఒక గదిలో యజ్ఞం చేసినపుడు మొదట ఆ గదిలోని వాయు

నంతా వేడెక్కును. వేడి వలన పదార్థాలు వ్యాకోచించును. అందుచే గాలికూడ వ్యాకోచం చెంది తేలికై పైకిపోయి ఆ గది యందు పట్టక కొంత బయటకు పోవును. యజ్ఞానంతరం క్రమంగా గది చల్లబడును. అచటి గాలికూడా చల్లబడి సంకోచం చెందుట వలన కొంత ఖాళీస్థల మేర్పడును. అప్పుడు బయటినుండి మంచి గాలి లోనికి ప్రవేశించును. ఇట్లు గదిలోనున్న గాలిని బయటికి పంపి బయటనున్న మంచిగాలిని లోనికి తెచ్చుటకు అగ్నిహోత్ర మెంతో తోడ్పడును. పంకా(Fan) వలన ఇంత ప్రయోజనం కలుగదు. కేవలం అచటి గాలి అచటనే తిరుగుచుండును. ఇంతేగాక, అగ్నిహోత్రంలో వేసిన మూలికలతో కూడిన వాయువు ఆ గదిలో మూల మూలలకు వ్యాపించుట వలన మూలలలో దాగియున్న అనేక సూక్ష్మక్రిములు నశించును. దుర్గంధం దూరమగును.

రోగక్రిముల నివారణకు సాధారణంగా ఫినాయిల్, డెట్టాల్ మొదలగునవి వాడుచుందురు. నిత్యం ఫినాయిల్‌తో ఇల్లు కడుగుట ఫినాయిల్‌తో యజ్ఞం చేయుటయే యగును కదా! దానివలన కేవలం నేల మాత్రమే శుభ్రమగును. గోడలు, పైకప్పు, మూల మూలలలోనున్న దుర్గంధం పోదు. దానిలో నుండి వచ్చు వెగటువాసన మరికొంత బాధను కలిగించును. దానికన్న అగ్నిహోత్రంవల్ల ఇల్లంతా శుభ్రమగుటతో బాటు మంచి సుగంధ వాయువుతో నిండును. అత్తరులు, సెంట్లు, పుష్పాలు మొదలగు సుగంధ ద్రవ్యాలకు ఈ విష వాయువులను భేదించి, రోగకారకాలను చంపి ఆ గాలిని బయటకు త్రోసివేయుశక్తిలేదు. అట్టి శక్తి అగ్నిహోత్రానికి మాత్రమే గలదు.

## డా. సత్యప్రకాశ్ గారి పరిశోధనలు:

పై విషయాన్ని మనం వైజ్ఞానికంగా నిరూపించ వలసి యున్నది. అలహాబాదు నివాసియైన డాక్టర్ సత్యప్రకాశ్‌గారు అగ్నిహోత్రంలో నుండి వెడలు వాయువులపై పరిశోధనచేసి 'అగ్నిహోత్ర' మను పేరుతో ఆంగ్లంలో నొకపుస్తకం వ్రాశారు. వీరు అలహాబాదు యూనివర్సిటీలో కెమిస్ట్రీ డిపార్టుమెంటునకు అధ్యక్షులుగా నుండెడివారు. వీరు ప్రముఖ ఆర్యసమాజ పండితులు గంగాప్రసాదు ఉపాధ్యాయులు గారి పుత్రులు. వీరు తమ

అనుచరులతో కలిసి ఈ పరిశోధనలు గావించారు.

డాక్టర్ సత్యప్రకాశ్ గారి బృందం చేసిన అగ్నిహోత్ర వాయువుల విశ్లేషణలో ముఖ్యంగా పది విషయాలు వెలుగులోనికి వచ్చినవి.

1. అగ్నిహోత్రం చేయునపుడు కుండంలో $200^0$ సెల్సియస్ నుండి $300^0$ సెల్సియస్ ఉష్ణోగ్రత ఏర్పడును. దానివలన చందనం, దేవదారు మొదలగు సమిధలలోని నూనెలు వాయురూపం చెందును. మిగిలిన మూలికలు సూక్ష్మాణువులుగా మార్చబడి వాయువులో కలిసిపోవును. పై మంటలలో $1000^0$ సెల్సియస్ కన్న ఎక్కువ ఉష్ణముండును. అందు నెయ్యి మొదలైన వన్నియు వాయురూపము చెందును.

2. తక్కువ ఉష్ణోగ్రతలో కూడ కొన్ని పదార్థాలు నీటితోపాటు ఆవిరగుచుండును. థైమాల్, యూజినాల్, ఎసిటాజినాల్, కార్వాక్రాల్ కౌమారిన్స్, ఫినైన్, బొర్నియా, టర్పినాల్, పినాల్ మొదలైనవి ఈ తక్కువ ఉష్ణోగ్రతలో వాయురూపం చెందును.

3. సమిధలు (కట్టెలు) మండుట వలన ఎసిటిక్ ఏసిడ్, మిథైల్ ఆల్కహాల్, మీథేన్, ఎసిటోన్, ఎసిటాల్‌డీహైడ్, నేప్తాలిన్ మొదలైనవి కట్టెల నుండి విడివడి వాయురూపం చెంది గాలిలో కలిసిపోవును.

4. సాంబ్రాణి, గుగ్గిలం, కర్పూరం మొదలైన వృక్షసంబంధ జిగురులు(Resinuous Substances) అగ్నిహోత్రంలోని వేడివలన ఫార్మల్‌డీహైడ్, టర్పెన్‌టైన్ మరియు తారు సంబంధమైన పదార్థాలుగా మారిపోయి గాలిలో కలియును.

5. కొన్ని సువాసన ద్రవ్యాలు మరియు క్రొవ్వు పదార్థాలు కొద్ది మార్పుతోనే పొగలో కలసిపోవును. వీటిని Colloidal vehicles అందురు.

6. క్రొవ్వు పదార్థాలు అగ్ని హోత్ర వేడిమివలన అనేక రకాల హైడ్రోకార్బన్స్‌గా మార్పుచెందును. దానిలోని గ్లిజరాల్ భాగం నుండి ఎసిటోన్, పైర్విక్‌ఆల్డీహైడ్, గ్లైకాల్‌ఆల్డీహైడ్, గ్లైఆక్సల్ మొదలైనవి ఉత్పన్నమగును. క్రొవ్వు సంబంధమైన ఆమ్లాలు కూడ హైడ్రోకార్బన్స్‌గా మారి వాయువులో కలిసిపోవును. వాటి నుండి మీథేన్, ఈథేన్, ప్రోపేన్, బూటేన్, ఎథిలిన్, బూటాడిన్, యాక్రిలక్

యాసిడ్, ఎసిటిక్ యాసిడ్ మొదలైనవి ఉత్పన్నమై గాలిలో కలిసిపోవును.

7. కొన్ని సంక్లిష్ట క్రొవ్వు పదార్థాలు అగ్నిహోత్ర వేడిమివలన సంక్లిష్టమైన క్రొవ్వు సంబంధమైన ఆల్డీహైడ్ వాయువులుగా మార్పుచెందుచున్నవి. అటువంటి వాటిలో ఆక్టిలిక్, నానిలిక్, వాలిరిక్, కార్బొరొనిక్ మొదలైన ఆల్డీహైడ్లు ముఖ్యమైనవి.

8. పైన వివరించిన వివిధ హైడ్రోకార్బన్‌లు వేడివలన మరికొన్ని మార్పులకు గురియగును. దానివలన మిథైల్, ఏథైల్ ఆల్కహోల్‌లు ఫార్మల్‌డీహైడ్, ఎసిటాల్ డీహైడ్‌లు; ఫార్మిక్ మరియు ఎసిటిక్ యాసిడ్‌లు మరికొన్ని గుర్తించలేని ఆల్డీహైడ్‌లు నిర్మితమై గాలిలో కలిసిపోవుచున్నవి.

9. పైన వివరించినట్లు వాయురూపాన్ని పొందిన వివిధ పదార్థాలు వాతావరణంలోనికి చేరిన పిమ్మట సూర్యకాంతి వలన మరికొన్ని మార్పులు చెందును.

10. అగ్ని హోత్రంలో చివరగా లెక్కించవలసినవి కార్బన్‌డైఆక్సైడ్ మరియు నీటి ఆవిరి. కార్బన్‌డైఆక్సైడ్ కొన్ని మార్పులవలన కొంత పార్మల్‌డీహైడ్‌గా మారును.

అగ్ని హోత్రంలో ముఖ్యమైన ఫార్మల్‌డీహైడ్‌తో బాటు స్వల్ప పరిమాణంలో మరికొన్ని ఆమ్లాలు వెలువడి గాలిలో కలియును. అందు ముఖ్యమైనవి.

<u>1. ఫార్మిక్ యాసిడ్:</u> ఇది శక్తివంతమైన క్రిమి సంహారిణి. ఎసిటిక్ యాసిడ్ కన్న శక్తివంతమైనది కాకపోయినా దీనివలన చాలా ప్రయోజనాలు కలుగును. పండ్లను నిలువ ఉంచుటకు, గాలిని శుభ్రపరచుటకు ఇది ఉపయోగపడును. డాక్టర్ రైడియల్ పరిశోధనలలో బి. టైఫస్ క్రిమి దీనివలన తొందరగా చనిపోయినట్లు గుర్తింపబడినది.

<u>2. ఎసిటిక్ యాసిడ్ :</u> ఇది ప్రాచీన కాలం నుండి ఉపయోగించబడుచున్న ఉత్తమమైన క్రిమి సంహారిణి. ఇది బి. కొలీ (B-coli) క్రిములను ఐదు నిముషాలలో చంపగల శక్తివంతమైనది. ఇది అగ్నిహోత్రం నుండి ఎక్కువగా

వెలువడి గది గోడలను, కప్పును క్రిమిరహితం చేయును. చెట్లకు క్రిముల వలన ఏర్పడిన గాట్లనుండి రక్షణ కల్పించును.

3. పైరోలెగ్నియస్ యాసిడ్ : కట్టెలు మండునపుడు ఈ ఆమ్లం ఎక్కువగా వెలువడును. ఇది ఫార్మల్‌డీహైడ్, క్రియోసోట్‌లతో కలిసి ఒక బలమైన క్రిమిసంహారిణిగా పనిచేయును.

4. ప్రాపియోనిక్ యాసిడ్ : ఇది ఫారమిక్ యాసిడ్‌లో సగం బలం కలిగిన క్రిమిసంహారిణి. అయినప్పటికి బలమైన బి. సబ్టిలిస్ మొదలైన బాక్టీరియాలను సంహరించినట్లు డాక్టర్ డుగాన్‌గారు చెప్పిరి.

5. వాలీరిక్ యాసిడ్ : ఇది చాలా తక్కువ బలం కలిగిన క్రిమి సంహారిణి. ఇది క్రియోసోట్స్‌తో కలిసి ఒక చిన్న క్రిమిసంహారిణిగా పనిచేయును.

6. పైరోవిక్ ఆల్డీహైడ్ మరియు పైరోవిక్ యాసిడ్‌లు: ఇవి కూడా స్వల్ప శక్తిగల క్రిమిసంహారకాలు.

వీరి పరిశోధన సారాంశ మేమన - అగ్నిహోత్ర వాయువులలో ప్రధానమైనవి మూడు : 1. ఆల్డీహైడిక్, 2. ఫినాలిక్, 3. యాసిడ్ వోలోటైల్ అను వాయు పదార్థాలు. ఇవన్నీ క్రిమిసంహారకాలు (బాక్టీరిసైడ్స్). వీటిలో కూడా ఆల్డీహైడిక్ వాయువులలో ప్రధాన మైనది ఫార్మల్‌డీహెడ్ వాయువు అత్యధికంగా ఈ అగ్నిహోత్రం నుండి వెలువడును. ఇది అత్యంత బలకరమైన క్రిమిసంహారక వాయువు. ఈ ఫార్మల్‌డీహైడ్ వాయువును గురించి ప్రపంచ ప్రఖ్యాత విజ్ఞానవేత్తలు లూయూ అండ్ ఫిషర్ (Loew & Fisher) అనేక పరిశోధనలు చేసి ఎన్నో రకాల రోగకారక సూక్ష్మజీవులు 20 నుండి 30 నిముషాలలో ఈ వాయువు వలన నశించుచున్నవని కనుగొనిరి. డాక్టర్ స్లాటర్ అండ్ రైడియల్ (Dr. Slater & Rideal) ఈ వాయువును 40% శక్తిగల ఒక ద్రవంగా తయారుచేసి వివిధ క్రిములపై ప్రయోగించగా టైఫస్, బి. కోలి (B-Coli) మరియు కోలన్ క్రిములు పది నిముషాలలో చనిపోయినవి. మిగిలిన క్రిములు 20 నిముషాలలో చనిపోయినవి.

ఈ ఫార్మల్‌డీహైడ్ వాయువును గురించి రసాయనిక గ్రంథాలలో ఈ

విధంగా వ్రాయబడి యున్నది. ఫార్మల్ డీహైడ్ ఒక బలమైన క్రిమిసంహారిణి. ఫార్మాలిన్ పేరుతో వాడు క్రిమిసంహారక మందులో ఇది 40% ఉండును. ఇది ముఖ్యంగా గదులను, గోడలను, రోగులుపయోగించు వస్తువులను శుభ్రం చేయుటకు ఉపయోగపడును. రోగగ్రస్త అవయవాలను శస్త్రచికిత్సచేసి తొలగించిన తరువాత వాటిని గురించి విద్యార్థులకు చెప్పుటకు ఆ అవయవాలను దీనిలో భద్రపరచవచ్చును". అట్టి శక్తిగల ఈ వాయువు మన ఇండ్లలోని గదులలో మూలమూలలలో దాగియున్న క్రిములను సంహరించగల దనుటలో సందేహ మేమి? ఇది వాయు వగుటవలన చుట్టుప్రక్కల వ్యాపించి ఆ ప్రాంతాన్ని కూడా పరిశుద్ధం చేయును.

వీరు తమ పరిశోధనలలో ఈ వాయువు నీటి ఆవిరితో కలిసినప్పుడు ఎక్కువ శక్తివంతంగా నుండునని కనుగొనిరి. అగ్నిహోత్రంలో నుండి వివిధ వాయువులతో బాటు కొంత నీటఆవిరి వెడలుచుండును. మనం అగ్నిహోత్రం చుట్టూ పోసేనీరు వేడికి కొంత ఆవిరి యగుచుండును. పెద్ద పెద్ద యజ్ఞాలలో మధ్యమధ్యలో ఆచమనములు చేయుచుండుట, ఇంద్రియములను మార్జనము చేసికొనుచుండుట జరుగుచుండును. ఇదియును కొంత తేమ వాతావరణమును కలిగించును.

## డా. ఫుందన్‌లాల్ గారి పరిశోధనలు

పై విషయాలు ఒక పరిశోధనాలయంలో చూచినగాని మనకు విశదంకావు. సామాన్యులు కూడా అర్థం చేసికోగల ఒక పద్ధతిని జబల్‌పూర్ నివాసియైన డా. ఫుందన్‌లాల్ గారు చెప్పియుండిరి. వీరు ఆంగ్లేయ వైద్యులు (ఎం.డి.). క్షయరోగ చికిత్సా నిపుణులు. వారు ఒక శానిటోరియంలో పనిచేయుచుండగా యాజ్ఞిక చికిత్సతో పరిశోధనలు జరుపవలెనను ఆలోచన వచ్చినది. యజ్ఞం ద్వారా క్షయరోగ నివారణ జరుపగల మను దృఢనమ్మకంతో తమ ఉద్యోగాన్ని విరమించుకొని వారొక చిన్న శానిటోరియం వంటి ఆశ్రమాన్ని స్థాపించిరి. అచట రోగులను పరిశుభ్ర వాతావరణంలో నుంచుచు, ఉదయ సాయంకాలాలలో రోగులందరను ఒక పెద్ద హాలులో కూర్చుండబెట్టి కొన్ని ప్రత్యేక మూలికలతో అగ్నిహోత్రం చేసేవారు. దానివలన మందులకన్నా ఎక్కువ

మేలు జరిగినది. 1949 లో 'యజ్ఞ చికిత్స' అను గ్రంథాన్ని వ్రాసిరి. ఆ కాలంలో క్షయ రోగ నివారణకు అనివార్యమని తలంచెడి స్ట్రెప్టోమైసిన్ మొదలైన మందులేవీ లేకుండా; ఏవైనా అత్యవసర సమయాలలో మాత్రం కొన్ని ఉపశమనకర మందులను వాడుచూ కేవలం యజ్ఞ చికిత్సపైననే ఆధారపడి వైద్యం చేసి అద్భుతమైన ఫలితాలను సాధించిరి. వైద్యలోకానికే ఆశ్చర్యం కలిగించిరి. ఈ రోగ నివారణకు పనికివచ్చే హోమద్రవ్యాలను కొన్నింటిని వారు సూచించిరి. వారు తమ గ్రంథమైన 'యజ్ఞ చికిత్స' లో 193 వ పేజీలో సామాన్యులకునూ అర్థమగునట్లు యజ్ఞ మహిమను తెలుపు ఒక ప్రయోగాన్ని చెప్పిరి.

పరిశుభ్రమైన వెడల్పు మూతి గల ఆరు గాజు సీసాలను తీసుకొని అందు ఒకదానిలో పాలు, రెండవదానిలో పండ్లు, మూడవదానిలో రొట్టెలు, మాంసము మొదలగు వాటిని కొద్దికొద్దిగా నుంచిరి. మరియొక ఆరు సీసాలను తీసుకొని వాటిలోకూడా పై వస్తువులనే కొద్దికొద్దిగా నుంచిరి. ఈ రెండు జతల సీసాలలో - ఒక జత సీసాలలో ప్రకృతిలో సహజంగా లభించు మంచిగాలిని (సముద్రతీర మందలి, పర్వత ప్రాంతమందలి మంచివాయువుతో) నింపిరి. మరియొక జత సీసాలలో యజ్ఞం చేయగా వెడలు వాయువును నింపిరి. ఈ రెండు జతలను వేరువేరుగా నుంచి ప్రతిదినం ఉదయం కొద్దిగా మూత తెరచి వాసన చూపించెడివారు. అందు సహజ పరిశుద్ధమైన వాయువుతో నింపిన సీసాలలో నుండి క్రుళ్ళిన వాసన ముందుగా వచ్చినది. యజ్ఞవాయువుతో నింపిన సీసాలలో మరికొన్ని దినముల తరువాతనే దుర్గంధము వచ్చినది. దీనినిబట్టి యజ్ఞవాయువు సహజ పరిశుద్ధ వాయువుకన్న ఎక్కువగా క్రిములను పెరగకుండ, దుర్గంధము రాకుండా నిరోధించునని అర్థమగుచున్నది.

2. అంటువ్యాధుల నివారణ, నిరోధములు జరుగును :

వాతావరణాన్ని పరిశుభ్రం చేయుటకు సృష్టిలో కొన్ని ఏర్పాట్లు కలవు. అందు ముఖ్యమైనవి సూర్యకిరణాలు, భూమిపై నున్న వేడి, వృక్షాలు, వీటినుండి వెలువడు సువాసనలు. ఇవి నిరంతరం వాతావరణంలోని దోషాలను నివారించుచుండును. వాటి శక్తికి మించిన కాలుష్యం ఏర్పడినపుడు

వాతావర్గణం దూషితమగును. అపుడు అంటు వ్యాధులు వ్యాపించును. అటువంటి సమయాలలో అగ్నిహోత్రం ప్రాతినిధ్యం వహించి ఒక పాకృతిక దోష నివారణ శక్తిగా పనిచేయును.

అంటువ్యాధులుగా వ్యాపించు మశూచికము, ఆటలమ్మ, పొంగు, కలరా, ప్లేగు మొదలగు అంటువ్యాధులు అగ్నిహోత్రం వలన దూరమగును. అయితే ఏ రోగానికి ఏ ఔషధాలను అగ్నిలో వేయవలసి యుండునో తెలిసికొనుట అవసరం. మన ప్రాచీన ఆచారం ప్రకారం మశూచికం, ఆటలమ్మ మొదలగునవి కనబడినపుడు సాంబ్రాణి, గుగ్గిలం పొగవేయుదురు. ఇది కూడ ఒక రకమైన యజ్ఞమే. ఒకసారి మద్రాసు నగరంలో ప్లేగు వ్యాధి వ్యాపించినపుడు అచటి మెడికల్ కాలేజీలోని విద్యార్థులకు డా. కింగ్ తయీ ఎం.ఎస్. గారు కేసరితో హవనం చేసిన ఈ రోగం వ్యాపించకుండా ఉండుననియు, అది రోగ నివారణకు కూడ ఉపయోగపడుననియు చెప్పియుండిరి. ఆయుర్వేద వైద్యులు చందన తైలంతో ఎన్నో రోగాలను ఉపశమింప చేస్తున్నారు. ఆ చందనపు కట్టెలను అగ్నిహోత్రంలో వేసిన మరింత లాభం కలుగును. తులసి కట్టెలతో (పుల్లలతో) హవనం చేసిన మలేరియా దూరమగును. కేవలం తులసి చెట్లపై నుండి వచ్చు గాలికూడ మలేరియా నిరోధానికి ఎంతో ఉపయోగపడును. పండరిపురంలో పెద్ద తులసివనం కలదు. ఆ చుట్టుప్రక్కల గ్రామాలలో మలేరియా వ్యాపించినపుడు పండరిపురంలో ఒక్కరికి కూడ మలేరియా రాలేదు.

హే జ్వరానికి (హే ఫీవర్) చక్కెరను నిప్పులపై వేసి దాని నుండి వచ్చుగాలిని పీల్చవలెనని ఒక ఆంగ్లేయ వైద్యుడు సలహా చెప్పుచుండెడివారు. ఫ్రాన్స్ దేశస్థుడైన డా. హైఫాకిన్ అను శాస్త్రవేత్త నేతిని అగ్నిలో జ్వలింప చేయుటవలన రోగక్రిములు నశించినవని తన పరిశోధనా వ్యాసంలో పేర్కొనెను. అదే దేశస్థుడైన డా. ట్రిల్ వార్డ్ కూడ చక్కెరను అగ్నిలో వ్రేల్చుట వలన శక్తివంతమైన రోగక్రిమినాశక వాయువు ఉత్పన్న మగునని చెప్పెను. విశేషంగా ఎండిన ద్రాక్ష, కిస్‌మిస్, ఖర్జూరం మొదలైన తియ్యటి పండ్ల వలన టైఫాయిడ్ క్రిములు 30 నిముషాల్లోను, మిగిలిన క్రిములు ఒకటి రెండు గంటలలోను చనిపోవుచున్నట్లు కనుగొంటి నని చెప్పెను. మద్రాసులో శానిటరీ

కమీషనర్‌గా పనిచేసిన ఆంగ్లేయుడు డా. కర్నల్ కింగ్ ఐఎంఎస్ నెయ్యి, బియ్యం, కేసరి కలిపి అగ్నిలో ఆహుతుల నిచ్చుటవలన అన్ని రకాల రోగక్రిములు నశించునని చెప్పిరి. ఈ ప్రమాణాలను బట్టి వ్యక్తిగత సామాజిక రోగాలను దూరం చేయుటలో అగ్నిహోత్రం ఎంతో మేలు చేయునని గట్టిగా చెప్పవచ్చును.

3. అగ్నిహోత్రం రోగాలను కలిగించు సూక్ష్మ జీవులను, విషవాయువులను నశింపజేయుటకు ఉపయోగపడును.

మొదటగా చెప్పినట్లు ఈ అగ్నిహోత్ర వాయువు వలన ఎన్నో రోగకారక క్రిములు నశించును. అందుచే రోగములు వ్యాపించవు. రోగములు లేకపోయిన మందులు, వైద్యశాలలు, డాక్టర్ల యొక్క అవసరమే యుండదు. వాటిపైన వ్యయం చేయు డబ్బులో ఈ అగ్నిహోత్రానికి సగము కూడా వ్యయం కాదు. అంతేగాక రోగం వలన కలిగిన బలహీనత, పనికి ఆటంకము మొదలగు యిబ్బందులు లేకుండా పోవును. శరీర ఆరోగ్యం బలపడి, రోగనిరోధకశక్తి పెరుగును. మనసు ప్రసన్నమగును.

విషవాయువులుకూడా దీనివలన నివారింపబడును. 1984 లో జరిగిన భోపాల్ విషవాయు దుర్ఘటనవలన ఎన్నో ప్రాణులు బలియైనవి. ఎంతోమందికి అనారోగ్యం కలిగినది. ఆ సమయంలో-

అది-1984 డిసెంబర్ 2వ తేది, అర్థరాత్రి భోపాల్‌లో యూనియన్ కార్బైడ్ ఫ్యాక్టరీకి ఒక మైలు దూరంలో నివాసమున్న యస్. యల్. కుష్వాహా అను పేరుగల ఒక ఉపాధ్యాయుడు తన భార్య శ్రీమతి త్రివేణి విపరీతంగా వికారంతో బాధపడుతూ, వాంతి చేసుకుంటూ ఉండగా మేల్కాంచెను. ఇంతలోనే పిల్లలు కూడా మేల్కొనిరి. వారు ఊపిరి అందక బాధపడుతూ ఉండటం, తనకు కూడా బాధ కలుగుతూ ఉండటంతో చూసి కంగారుపడి వీధి కిటికీ తలుపులు తెరవగా ప్రజలందరు కంగారుతో పరుగులు తీయడం కనబడింది. అందులో ఒకరిని పిలిచి ప్రశ్నించగా విషవాయువు లీక్ అయిన కారణంగా చాలా ప్రమాదం ముంచుకు వచ్చినదని తెలుసుకొనిరి.అతను కూడా ప్రాణ రక్షణకై వారితో కలిసి దూరంగా పారిపోవడమే శ్రేయస్కరమని

భావించెను. కాని, సమయస్ఫూర్తిగల భార్య త్రివేణి "మనం" అగ్నిహోత్రం ఎందుకు ప్రారంభం చేయకూడదు? దానివలన విషవాయువులు నశించునని ఎంతగానో వినియుంటిమి కదా?' అని సలహా యిచ్చెను. వెంటనే భార్యాభర్త లిరువురు పిల్లలతో కలిసి 20 నిముషాలు హవనం చేసిరి. ఇంతలో విషవాయు ప్రభావం కూడా తగ్గుతూ వచ్చినది. ఆ విషవాయువు వలన వారికెట్టి అపకారము కలుగలేదు. అనంతరం ఏ రోగమూ బాధించలేదు. కాని, ఆ విషవాయువు వలన యితరు లెందరో ప్రాణాలు గోల్పోయిరి. ఎందరో యిప్పటికిని రోగాలతో బాధ పడుతున్నారు.

ఆనాడే భోపాల్ రైల్వేస్టేషన్ సమీపమున ఒక ఇంటిలో నివసించే శ్రీ ఎం.ఎల్. రాథోర్ కూడా తన భార్యా పిల్లలతో హవనం చేస్తూ మృత్యుంజయ మంత్రంతో ఆహుతులిచ్చుచు గడిపెను. వారికి కూడా విషవాయువు వలన ఎట్టి ప్రమాదం కలుగలేదు. ఇట్టి సంఘటనలెన్నో కలవు. అందుచేతనే శ్రీకృష్ణుడు భగవద్గీతలో యజ్ఞమహిమను వర్ణించుచు-

**'దేవా న్భావయ తానేన, తే దేవా భావయంతు వః ।**

**పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ'** ॥ (భగవద్గీత 3-11)

అని చెప్పియుండెను. అనగా ఈ యజ్ఞం వలన దేవతలు (జడ దేవతలైన పంచభూతాలు - భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము భావన (శుద్ధము) చేయబడును. ఆ భావన చేయబడిన దేవతలు మిమ్ములను భావన చేయును. ఈ విధంగా పరస్పరం భావన చేసికొనుచు ఉత్తమ సుఖాలను పొందుడని ఉపదేశించెను. (ఇచట భావన అనగా స్మరించుట యని అర్థం కాదు. ఆయుర్వేదంలో భావన చేయుట అనగా ఖనిజాలు మొదలగు వానిలోని దోషాలను పోగొట్టుటకు కొన్ని మూలికల రసాలు ఆ ఖనిజాలలో వేసి కల్వంలో బాగుగా మర్ధింతురు. అప్పుడది శుద్ధమగును. అందుచేతనే శుద్ధి చేయబడిన గంధకాన్ని భావనగంధక మని వ్యవహరింతురు. అట్లే, అగ్నిహోత్రవాయువు భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను పంచదేవతలను (పంచభూతములను) సంస్కరించునని గ్రహించవలెను.)

అగ్నిలో వేసిన పదార్థం వెంటనే గాలిలో కలిసి గాలిలోని దోషాలను సంస్కరించును. దూరదూర ప్రాంతాలకు చేరును. దానిని పీల్చిన ప్రాణులన్నింటిని అది సంస్కరించును. కొంత పైకివ్యాపించి మేఘాలలో చేరి, మేఘాలలోని దోషాలను సంస్కరించును. మరికొంత సూక్ష్మ పదార్థం - హైడ్రోజన్ మొదలైన వాయువులు, పరమాణు శకలాలు భూవాతావరణాన్ని దాటి ఆకాశాన్ని (అంతరిక్షమును) సంస్కరించును. అంతేగాక, అగ్నిహోత్రంలోని సూక్ష్మాంశం సూర్యున్ని చేరుకోగలదని శాస్త్రాలు చెప్పుచున్నవి. మనువు తన ధర్మగ్రంథంలో-

**'అగ్నౌ ప్రస్తాహుతిః సమ్యగాదిత్య ముపతిష్ఠతి'** (మనుస్మృతి 3-76)

అని చెప్పియున్నాడు.

హైడ్రోజన్ వాయువు చాలా తేలికైన వాయువు. అది భూమండలంపై చాలా తక్కువగా నుండును. మనం ప్రయత్నపూర్వకంగా సిద్ధపరచినను అది భూమిపై నిలుచుట కష్టం. దాని ప్రయాణవేగం సెకనుకు 7 మైళ్ళకన్నా మించి యుండుటచే భూమి దానిని నిలుపలేదు. ఈ సౌరకుటుంబంలోని పెద్దగోళమైన సూర్యుడు మాత్రమే దానిని ఆకర్షించి నిలుపుకోగలడు. అందుచే ఈ సౌరకుటుంబంలోని ఏ గ్రహంలోను హైడ్రోజన్ వాయువు నిలువక సూర్యుని చేరుచుండును. దానితోబాటు కొన్ని పరమాణు శకలాలు సూర్యుని చేరి అచట మంటలను సంస్కరించి దాని ప్రభావం భూవాతావరణంపై ప్రాణుల కనుకూలంగా నుండునట్లు చేయును. భూమిపై కలుగు తుఫానులు, ఉప్పెనలు, భూకంపాలు, అతివృష్టి, అనావృష్టి మొదలగు ఉపద్రవాలకు సూర్యునిలో ఏర్పడుచుండు మచ్చలు (సన్‌స్పాట్స్) కారణమని పెక్కురు వైజ్ఞానికుల అభిప్రాయం. అప్పుడప్పుడు ప్రబలంగా వ్యాపించు అంటువ్యాధులకును ఈ మచ్చలే కారణమని కొందరి అభిప్రాయం.

ముఖ్యమైన హోమద్రవ్యాల విశ్లేషణ:

## ఆవునెయ్యి

అగ్నిహోత్రంలో ఇంతటి సంస్కరణ శక్తి ఎటుల వచ్చునని సందేహం కలుగుట సహజం. హోమద్రవ్యాలలో ప్రధానమైనది ఆవునెయ్యి. దీనికి సంస్కృత భాషలో 'ఆజ్యము, సర్పి' అను రెండు పేర్లు గలవు. ఈ పదములలో ఎంతో వైజ్ఞానిక భావం కలదు. 'ఆజ్య' పదము నిరుక్తంలో 'ఆ సమంతాత్ జయన్తి అసురాన్ అనేన' అని నిర్వచింపబడినది. దేనివలన వాతావరణంలోని ప్రాణులకు శత్రువులైన క్రిములు నశింపబడునో అది ఆజ్యము అని దీని అర్థం. వైజ్ఞానికంగా నెయ్యి అగ్నిలో వేసినపుడు హైడ్రోకార్బన్స్‌గా విశ్లేషింపబడును. అవి కొంత పరివర్తన చెంది ఫార్మల్‌డీహైడ్‌గా మారును. ఆ ఫార్మల్ డీహైడ్ ఒక శక్తివంతమైన క్రిమి సంహారిణియని ఇంతకు ముందు తెలిసికొనియుంటిమి కదా ! దీనికి మరియొక పేరు సర్పి. ఈ పదము **"సృ-గతౌ"** అను ధాతువుచే సిద్ధించును. ఇదే మూలధాతువుతో **'సర్ప'** మను పదము కూడా తయారగును. అత్యంత గతి కలిగినది లేదా విశేషమైన గతి కలిగినది అని అర్థం వచ్చును. పాములు గాలిలో నుండు విషవాయువులను సేకరించి విషంగా మార్చి తమ ప్రాణరక్షణ కొరకు కోరలలో నుంచుకొనును. అనగా ఒకరకంగా పాములు గాలిలోని విషవాయువులను సంస్కరించు చున్నవి. అట్లే అగ్నిలో వేయబడిన నెయ్యి (సర్పి) కూడా పామువలె అత్యంత వేగంతో గాలిలో ప్రవేశించి విషవాయువుల నశింప జేయును.

ఈ జ్ఞానం మన ఋషులకు వేదాధ్యయనం వలన కలిగినది. వేదాలు ఘృతానికి ఒక చక్కటి విశేషణం చెప్పును. **'అమృతస్య నాభిః'** (యజుర్వేదం) అనగా ఈ ప్రాణిసమూహానికి అమృతాన్ని పంచియిచ్చు నాభివంటి దని అర్థం. అగ్నిలో వేసిన నెయ్యి సూక్ష్మాణువులుగా మారి గాలిలో కలిసి దానిని పీల్చుకొనిన ప్రాణులకు బలాన్ని, శక్తిని ఇచ్చును. శరీరంలోని విషాలను హరించును. ఋగ్వేదం దీనిని **'జఘాన నవతీర్నవ'** అని చెప్పును. అనగా శరీరంలోని విషాలను హరించి నిత్యనూతన యవ్వనంతో ప్రకాశింపజేయునని అర్థం. అగ్నిలో వేయబడిన నేతికే ఇట్టి గొప్ప గుణాలు ఎక్కువగా నుండును. వేదాలలో నొక ప్రశ్న వేసుకొని దానికి సమాధానం చెప్పబడినది. ప్రశ్న - **'పృచ్ఛామి త్వా విశ్వస్య భువనస్య నాభిః'** -అనగా విశ్వ ప్రాణులకు పుష్టినిచ్చు నాభివంటి

కేంద్ర మేది? జవాబు – 'అయమ్ యజ్ఞో విశ్వస్య భువనస్య నాభిః' అనగా ఈ యజ్ఞమే సమస్త భువనాలకు, అందు నివసించు ప్రాణులకు పుష్టినిచ్చు కేంద్రం.

అగ్నిహోత్రంలో ఆవునేతిని వేయటం శ్రేష్ఠం. దానిలోనే పై విశేషగుణాలన్నియు నున్నవి. ఈ మధ్య అమెరికా, జర్మనీ మొదలైన దేశాలలో జరిగిన పరిశోధనలలో ఆవునేతిని గురించి కొన్ని ఆసక్తికరమైన విషయాలు తెలిసినవి. అమెరికాదేశీయులైన గొప్ప మానసిక శాస్త్రవేత్త శ్రీ బేరీరత్నార్ మన దేశానికి వచ్చి మహారాష్ట్రలోని 'అంబాజోగాయి' అను గ్రామంలో ముగ్గురు మానసిక రోగులపై అగ్నిహోత్రం ద్వారా చికిత్స జరిపిరి. కొద్ది రోజులలోనే వారి బుద్ధివికాసంనందు ఏ మందులవల్ల, ఏ ప్రక్రియలవల్ల కలగనంత ఎక్కువగా అభివృద్ధి కనబడినది. జర్మనీ దేశంలో అగ్నిహోత్ర ఔషధీ ప్రయోగకేంద్ర మున్నది. వారు అగ్నిహోత్ర భస్మంతో వివిధ రకాల మందులను తయారుచేసి రోగులపై ప్రయోగించిరి. అద్భుతమైన ఫలితాలు కనబడినవి. వీరందరు అగ్నిహోత్రంలో ఆవునేతినే ఆహుతిగా యిచ్చియుండిరి.

ఆవునేతిని గురించి ఆయుర్వేద పితామహుడైన సుశ్రుతాచార్యుడు ఇది గొప్ప విషనాశకద్రవ్యమని వర్ణించియున్నాడు. ఇప్పటికీ పంజాబ్ ప్రాంతంలోని పొలాలలో తిరుగువారిని పాము కరిచిన వెంటనే వేడి చేసిన ఆవునేతిని పైకి లేపనము చేసి, లోపలికి నేతిని త్రాగింతురు. దానివల్ల విషప్రభావం తగ్గిపోవును. ఈ విషయం నేటి వైజ్ఞానికులును అంగీకరించుచున్నారు. చైనాదేశం నుండి ప్లేగు వ్యాధి మనదేశంలో ప్రవేశించినపుడు యూరోపు వైద్యులు దీని నివారణకు ఉపాయాలు వెదకసాగిరి. వారిలో ఫ్రాన్సుదేశీయుడైన సుప్రసిద్ధ వైద్యుడు డాక్టర్ హైఫకిన్ ఎక్కువగా పరిశోధించి 'The Bubonic Plague' అను పుస్తకాన్ని వ్రాసిరి. దానిని 'పయోనీర్ ప్రెస్' ప్రచురించినది. దానిలో ఆయన ఒకచోట ఈ విధంగా వ్రాసిరి. "ప్లేగు వ్యాధి నిరోధ నివారణలకు మేము చాలా నెలలుగా ఔషధాలను వెదకుచు పరీక్షలు చేయుచుంటిమి. అన్ని ఔషధాలకన్న 'క్లారిఫైడ్ బట్టర్' శ్రేష్ఠతమం (దీనినే భారతీయులు నెయ్యి అందురు). దీనివలన ఆశ్చర్యకరమైన

ఫలితాలు కలిగినవి. అందుచే ఇది గొప్ప విషనాశక ద్రవ్య" మని తెలియజేసెను.

ఈమధ్య రష్యా దేశపు ప్రఖ్యాత వైజ్ఞానికుడు డాక్టర్ శిరోవిచ్ ఆవు పాలు, ఆవునెయ్యి, ఆవుపేడ మొదలగు వాటిని గూర్చి చేసిన పరిశోధన ఫలితాలు చాలా ఆశ్చర్యకరంగా నున్నవి. వారు ఈ విధంగా వివరించిరి: 1. ఆవుపాలల్లో రేడియోధార్మికశక్తినుండి రక్షణ కల్పించు శక్తి ఎక్కువగా నున్నది. 2. ఆవుపేడతో అలికిన ప్రాంతం రేడియోధార్మికశక్తిని నిరోధిస్తుంది. ఇంటిపైన ఆవుపేడతో అలికిన యెడల ఆ యింటిలోనికి రేడియోధార్మికశక్తి ప్రవేశించుటలేదు. ("ఆవుపేడలో పడిన పిడుగు బంగారంగా మారు" నను మాటలు సత్యమే కావచ్చునేమో !)" 3. ఆవునేతిని మంటలో వేసిన దాని పొగవలన (యజ్ఞవాయువు వలన) వాయు మండలంలోని రేడియేషన్ యొక్క ప్రభావం తగ్గిపోవుచున్నట్లు కనబడుచున్నది.

ప్రస్తుతం డాక్టర్ శిరోవిచ్ రష్యాదేశంలో పంచగవ్యాలైన ఆవుయొక్క పాలు, పెరుగు, నెయ్యి, పేడ, మూత్రములపై పరిశోధించుచున్నారు. వీటివలన అనేక రకాలైన చర్మవాధ్యులు పూర్తిగా నయమగుచున్నవి. మరికొన్ని రోగాలు కొంత నివారణ యగుచున్నవి. ఆరోగ్యవంతులు వీటిని సేవించిన నిరోగులై దీర్ఘజీవనాన్ని పొందగలరని చెప్పుచున్నారు. ఆయుర్వేద శాస్త్రాలలో ఇది విషనాశకమే గాక మరెన్నో గుణాలు కలదిగా వర్ణింపబడినది-

శ్లో॥ **ధీ కాంతి స్మృతి దాయకం బలకరం మేధాప్రదం పుష్టిదం,**
**వాతశ్లేష్మహరం విపాకమధురం. పిత్తాపహం హృదితం,**
**వహ్నేర్వృద్ధికరం శ్రమోపశమనం వృష్యం వపుస్థైర్యదం,**
**గవ్యం హవ్యతమం ఘృతం బహుగుణం భోగ్యం భవేద్భాగ్యతః ॥**

"ఆవునేయి బుద్ధిబలమును, కాంతివృద్ధిని, జ్ఞాపకశక్తిని, బలమును మేధను, బలుపును కలుగజేయును. వాత శ్లేష్మరోగాల నుపశమింపజేయును. మరియు ఇది విపాకమున మధురమై యుండును. పిత్తముల శాంతి నొందించును. హృదయానికి, హితకరమై జఠరాగ్ని నుద్దీపింపచేయును. శ్రమాయాసముల పోగొట్టును. శుక్రవృద్ధి నొసంగును. శరీరానికి స్థిరత

నొసంగును. హవ్యములుగా అగ్నిలో ఆహుతుల నిచ్చు పదార్థాలలోకెల్ల నియ్యది మిక్కిలి శ్రేష్ఠమైనదియు, విస్తారమగు గుణము కలదియు, ఎంతటి యదృష్టవంతులకో గాని అనుభవించు భాగ్యం కలుగదనియు" ఈ శ్లోక తాత్పర్యం.

ఆవుపాలలోనూ ఇట్టి గుణములే యుండును. తల్లిపాల తదుపరి పేర్కొనదగిన శిశు ఆహారం ఆవుపాలు. అవి శిశువులనే గాక పెద్దలనుకూడా ముసలితనం వరకు పోషించుచుండును. అందుచేతనే భారతీయులకు ఆవు అమ్మ వంటిది. ప్రాచీన భారతదేశంలో గోసంపదనే సంపదగా నెంచెడివారు. దాని తదుపరియే ధనానికి ప్రాధాన్యత ఇవ్వబడెడిది. తాంత్రికమత ప్రభావంతో పవిత్రమైన ఆవునేతికి తోడు ఆవునుకూడా చంపి హోమం చేసి దాని మాంసమును ప్రసాదముగా తిను దురాచారము ప్రబలినది. బుద్ధుని బోధనలతో కొంత పరివర్తన చెందినను విదేశీయుల పాలనలో మరల గోవధకు ప్రోత్సాహం లభించినది. స్వరాజ్యం వచ్చినప్పటికీ పూర్తి గోవధ నిషేధం అమలు పరచక పోవుటచేతను, గోసంతతిని పెంచుటకు తగిన కృషి చేయకపోవుటచేతను నేడు ఆవుపాలు దొరుకుటయే అపురూపంగా నున్నది. ఆవునెయ్యి లభించుట మరింత కష్టతరం. అంతమాత్రాన అగ్నిహోత్రం చేయుట మానుకొనుట మంచిదికాదు. గేదెనేతిలో కూడా కొంత తక్కువగా ఈ గుణము లుండును. ఆయుర్వేద శాస్త్రాలలో గేదెనేతిని గురించి ఈ విధంగా చెప్పబడినది :

శ్లో॥ **సర్పి ర్మాహిష ముత్తమం ధృతికరం సౌఖ్యప్రదం కాంతికృత్**
**వాతశ్లేష్మనిబర్హణం బలకరం వర్ణప్రదానే క్షమం**
**దుర్నా మగ్రహణీవికారశమనం మందానలోద్దీపనం, చక్షుష్యం**
**నవగవ్యతః పదమిదం హృద్యం మనోహారి చ ॥**

"గేదెనెయ్యి ఉత్తమమైనది శరీరమునకు కాంతిని, సౌఖ్యమును ఇచ్చును. వాతశ్లేష్మములను హరించును. బలకరమైనది. కంటికి శక్తి నిచ్చును. అగ్నిమాంద్యమును పోగొట్టును. హృద్యమైనది, మనోహరమైనది" అని చెప్పబడినది. గేదె (బఱ్ఱె) నేతితో హవనం చేయునప్పుడును అత్యంత క్రిమినాశక

గుణముగల 'ఫార్మల్ డీ హైడ్' ఉత్పన్నమగును. మిగిలిన బుద్ధివృద్ధికర గుణాలు లేకున్నను ఆరోగ్య దృష్టితో దీనితో చేయవచ్చును. క్రమంగా గోసంతతిని వృద్ధిచేసుకొని గోఘృతంతో హవనం చేయగల స్థితికి పయనించ వచ్చును.

## తేనె

హోమద్రవ్యాలలో తేనె మరియొక ప్రధానమైన వస్తువు. దీనికి ఆయుర్వేదంలో 'యోగవాహిని' యని పేరు. మందులలో ఇది కలిపిన వాటి ఔషధీగుణము ద్విగుణమగు నని చెప్పబడినది. హోమద్రవ్యాలలో దీన్ని కలుపుటవలన వాటి శక్తికూడా ద్విగుణ మగును. మనకు లభించు మధుర పదార్థాలలో తేనె శ్రేష్ఠతమ మని చెప్పవచ్చును. దీనిలో అతి తేలికగా జీర్ణమగు గ్లూకోజు, ఫ్రక్టోజులు సమాన భాగాలుగా నుండును. జీర్ణమగుటకు ఏ విధమైన జీర్ణరసాల అవసరం లేకనే నేరుగా రక్తంలో కలియును. వీటితోబాటు ఇనుము, కాల్షియం, పొటాషియం వంటి సేంద్రియలవణాలు, విటమిన్లు అధికంగా నుండును. వైద్యుల పరిశోధనలలో ఆటగాండ్రకు ఆట మధ్య విరామ సమయంలో తేనె కలిపిన నీరిచ్చుట ఎక్కువ లాభకరమని గుర్తింపబడినది. దానిని శుద్ధిచేసి ఇంజెక్షన్ ద్వారా నేరుగా రక్తంలోనికికూడా యివ్వవచ్చునని కొందరంటారు. గ్లూకోజ్ వలె ఇది శ్లేష్మాన్ని కలిగించదు. ఏదైనా శ్లేష్మ తత్త్వమున్న పోగొట్టును. శరీరానికి పుష్టిని, కాంతిని ఇచ్చును. మరెన్నో ఔషధగుణాలు దీనియం దున్నవి. దీనిని అగ్నిహోత్రంలో వేసినపుడు సూక్ష్మీకరింపబడి మరింత లాభం కలుగును.

## సోమలత

సోమలత గురించి వేదాలలో చాలా గొప్పగా వర్ణింపబడినది. పూర్వకాలమున యజ్ఞాలలో దీనిని, దీని రసమును ప్రధాన హోమ ద్రవ్యంగా వాడెడివారు. ఇది ఓషధులలో రాజువంటిది **(సోమ ఓషధీనా మధిపతిః)**. దీని గుణాలను వర్ణించుచు అథర్వవేదం–

**"సోమః ఓషధీభి రుదక్రామత్ తాం పురం ప్ర ణయామి వః**

**తామా విశత తాం ప్రవిశత సా వః శర్మ చ వర్మ చ యచ్ఛతు."**

(అథర్వవేదం 19-19-5)

భా. అ. అగ్ని హోత్రంలో ఆహుతి యివ్వబడిన సోమలత మిగిలిన ఓషధులన్నిటితో కలిసి వాయురూపాన్ని జెంది తాను అగ్రగామినియై నలుదిశల వ్యాపించి ప్రాణులను రక్షించును. అట్లే విద్వాంసులు, నాయకులు సామాన్య ప్రజలకు సుఖ సంతోషాల నిచ్చుచు రక్షింపవలయును.

గోపథ బ్రాహ్మణం (ఉ. 1-17) ఇది ఓషధులలో రాజు వంటిది **"సోమ ఓషధీనా మధిరాజా"** అని వర్ణించును. ఋగ్వేద నవమ మండలంలో విస్తృతంగా దీని వర్ణన కలదు. ఇది పర్వత ప్రాంతాలందు పెరుగు ననియు, ఎత్తుగా ఆకాశంవైపు ఎగబ్రాకుననియు, దీని ఆకులు **"హరితం భ్రాజమానం హిరణ్యయం"** (ఋగ్. 9-5-10) - ఆకుపచ్చ వర్ణంలో బంగారు కాంతు లీనుచుండు"ననియు వివరింపబడినది. దీని విశేష గుణాలను తెలుపుటకు 40కిపైగా పేర్లతో వర్ణింపబడినది. ఇది **"స్వాదిష్టయా మదిష్టయా పవస్వ సోమ ధారయా"** (ఋ. 9-1-1) అత్యంత మధురమైన రుచి గలిగి, మనస్సుకు ఆహ్లాదం నిచ్చుననియు, అట్లని ఇది మద్యం (కల్లు) కాదనియు, మేధావులు, వీరులు కూడా దీనిని పానం చేయవచ్చుననియు వేదం వివరించును.

కాని, ఈ వేదోక్త సోమలత బ్రాహ్మణ గ్రంథాలు రచింపబడిన కాలం నాటికే లుప్తమైనట్లు కనబడుచున్నది. ఏలయన శతపథ బ్రాహ్మణం (4-5-10-1-6)లో సోమలత దొరకని యడల **"ఆదార"** మను వనస్పతిని అభావ ప్రతినిధిగా (సమాన గుణ ధర్మములు గల ద్రవ్యంగా) గ్రహించవచ్చునని చెప్పబడినది. తాణ్డ్య మహా బ్రాహ్మణం (9.5.3)లో **"యది సోమం న విన్దేయుః పూతికా నభిషుణయు ర్యది న పూతికా నర్జునాని"** - సోమము లభించనిచో పూతికమ్ (గచ్చ చెట్టును), అదియు లభ్యం కానిచో అర్జున చెట్టును అభిషవ క్రియకు (సోమ రస నిర్మాణమునకు) ఉపయోగించవచ్చు" నని చెప్పబడినది.

ఇక ఆయుర్వేదాన్ని పరిశీలించిన సుశ్రుత వర్ణన ప్రకారం "ఇది ఒక లత (తీగ). శుక్లపక్షంలో దినమున కొక ఆకు చొప్పున పౌర్ణమి నాటికి 15

ఆకులు పుట్టును. మరల కృష్ణపక్షంలో ఆ ఆకులే దినమున కొకటి రాలిపోవును. అమావాస్యనాడు వట్టి తీగగా మిగిలిపోవును. ఇట్లు పెరుగుచు (ఎదుగుచు) పోవును". కాని, అట్టి సోమమును సంపాదింప మధ్యయుగ వైద్యులు పర్వత నదీ ప్రాంతాలలో ఎంతగానో వెదికిరి. కాని, అట్టిది లభించలేదు. చివరకు కొంత సమాన గుణాలు గల ఒక తీగను సంపాదించి దానికే **'సోమలత'** Ephidra యని పేరిడిరి. దాని ఆల్కలాయిడ్ నేడు శ్వాస వ్యాధికి మందుగా ప్రయోగించుచున్న Ephidrine ఆంగ్లనామంతో పిలువబడుచున్నది. ఇది శ్వాసను అభివృద్ధి పరచి మానసిక ఉత్సాహమును, శారీరక చైతన్యమును కలిగించును.

కొందరు ఆయుర్వేద వైద్యులు వృక్ష శాస్త్రమున Asclepias Acidia అను పేరుతో వ్యవహరింపబడు మూలికకు, సోమలతకు దగ్గరసంబంధ మున్నట్లు చెప్పుచున్నారు. హోమియో వైద్యులు ఉపయోగించు Asclepias tubarosa (Pleurisy root) కు ఆంగ్లేయ వైద్యులు ఉపయోగించు Ephidrineకు దగ్గర సంబంధ మున్నది. డా॥ గురుదత్ M.Sc., గారు వేదోక్త **'సోమ'** వర్ణన నేటి పరమాణు విజ్ఞానంలోని న్యూట్రాన్స్‌కు సరిపోవుచున్నదని అనేక ప్రమాణాలను చూపిరి. అవి ఎక్కువగా ఆహార పదార్థాలలోను, మూలికలలోను ఉండునని చెప్పిరి. అట్టి న్యూట్రాన్లు అధిక శాతంలో గల మూలికలే సోమముగా చెప్పవచ్చును. నేతి అణువుల గర్భంలో న్యూట్రాన్ల సంఖ్య అధికంగా నుండును గాన నేతిని సోమమని వేదం కొన్ని సందర్భాలలో సూచించును. అట్లే సోమలతలో - వాటి అణువుల గర్భంలో న్యూట్రాన్లు అధిక సంఖ్యలో ఉండవచ్చును. ఇది పరిశోధించవలసిన విషయము.

పై పరిశోధన లన్నిటి కన్నను పం. వీరసేన్ వేదశ్రమీ గారి పరిశోధనయే హేతు బద్ధముగా నున్నది. మహర్షి దయానందుడు తన 'సంస్కార విధి' యను గ్రంథంలో రోగనాశక హోమద్రవ్యాల గురించి చెప్పుచు 'సోమలత అనగా తిప్పతీగ మున్నగు ఓషధులు' అని వ్రాసిరి. ఈ ప్రేరణతో కీ॥ శే॥ పం. వీరసేన వేదశ్రమీ గారు అనేక ఆయుర్వేద గ్రంథాలను పరిశీలించి పై దయానంద మహర్షి మాటలు సత్యమేనని నిరూపించిరి. వారి పరిశోధనా

సారంశ మేమన-

'సోమరస' మనగా ఓషధులలో బలము నిచ్చు ఒక రసాయన పదార్థం. ఇది సోమలతలో ఎక్కువగా నుండును. ఈ సోమలతని మన ప్రాంతమున 'తిప్పతీగ' యని పిలుతురు. దీనికి వృక్షశాస్త్ర లాటిన్ భాషా పదము Cocculus Cordifolious ఆయుర్వేద గ్రంథాలలో ఇది అమృత, సోమవల్లి, రసాయని మొదలగు పేర్లతో చెప్పబడినది. ఆ గ్రంథాలలో ఇది ఒక జీవన ప్రదాయనిగా, అత్యంత బలవీర్యాలను కలుగచేయునదిగా వర్ణింపబడినది. తిప్పతీగ నుండి తిప్పసత్తు అను ఒక రసాయనాన్ని తీయుదురు. దీనిని ఆయుర్వేద ఔషధాలలో బలమునిచ్చు మందులన్నిటిలో కలుపుదురు. అట్టి లతను ఎండించి అగ్నిహోత్రంలో వేయుటవలన పోషకవంతమైన బలమునిచ్చు వాయువు వెలువడును. ఇది మానవులకు, ప్రాణిసమూహానికేగాక వృక్షాలకు, జడపదార్థాలకు - పర్వతాలు, నదులు, సూర్య చంద్ర నక్షత్రాదులకునూ బలము నిచ్చునదిగా వేదాలలో వర్ణింపబడినది. దీనిని గురించి ఇంకా పరిశోధన జరుగవలసి యున్నది.

ఇటువంటివే హోమంలో వేయదగ్గ మరికొన్ని మూలికలను గురించి అథర్వవేదం వివరించుచున్నది. అథర్వవేదంలోని 8వ కాండం 7వ సూక్తంలో 23 నుండి 27 మంత్రాలు హోమ ద్రవ్యాల కుండవలసిన గుణాలను గురించి వివరించును. అందు ఆవు, గొర్రె, మేక, లేడి మొదలగు జంతువులు తినదగిన వనస్పతు లన్నింటినీ; హంస, చిలుక, గోరింక మొదలగు పక్షులు తినదగు గింజల నన్నిటిని; వైద్యులు ఔషధాలలో నుపయోగించు మూలికలన్నింటినీ అగ్నిహోత్రంలో ఆహుతు లివ్వవచ్చునని చెప్పబడినది. కాని, ఏ సందర్భంలో ఏ మూలిక ప్రయోగించవలెనో, ఎంత ప్రయోగించవలెనో తెలిసికొని ఆచరించుట ఎంతైన అవసరం. ప్రాణులకు హానిని కలిగించు విషసంబంధమైన మూలికలను అగ్నిలో వేయరాదు. ఇట్టి ఔషధీకృత వాయువులతో కూడిన వాతావరణం నిర్మించుకొని మీరందరూ సుఖించుడని పరమేశ్వరుడు వేదం ద్వారా-

"ఆ వాతవాహి భేషజం వి వాత వాహి యద్రప ః।
త్వం హి విశ్వభేషజో దేవానాం దూత ఈయసే ॥"

(ఋ. 10-137-3)

వాయువు అగ్నిహోత్రం ద్వారా ఓషధులను స్వీకరించి తనలోని దోషాలను పోగొట్టుకొని ప్రాణులకు సుఖము నిచ్చును. ఇది దేవదూత వంటిది. విశ్వమునకు వైద్యుని వంటిది" యని ఉపదేశించెను.

## హోమద్రవ్యాలు నాలుగు విధాలు

1. సుగంధ ద్రవ్యాలు : ఇవి సువాసనలను వెదజల్లుటయే గాక కొద్ది క్రిమిసంహారకశక్తిని కలిగి యుండును. వీటిని అగ్నిలో వేసిన వాయురూపాన్ని చెంది మరింత శక్తివంత మగును. కస్తూరి, కుంకుమ పువ్వు, అగరు, తగరు, తెల్లచందనము, ఏలకులు, జాజికాయ, జాపత్రి మొదలగునవి ఈ వర్గానికి చెందును. డా॥ సత్యప్రకాశ్ గారి పరిశోధనలలో 'నేప్థాలిన్, కేంపర్, థైమాల్' వంటి మూలికలు ఎన్నో రకాలైన క్రిములను కొన్ని నిముషాలలోనే చంపినట్లుగా వెల్లడైనది. మంచిగంధం, కేసరి మొదలగునవి రోగనాశకాలు. వీటిలో సాంబ్రాణి, గుగ్గిలం మొదలగునవి బలవత్తరమైన క్రిమిసంహారిణులు. వీటిని మితంగా ప్రత్యేక పరిస్థితులలో ఆహుతిగా యివ్వవచ్చును.

2. పుష్టి కారకాలు (బలవర్ధకాలు) : కొన్ని మూలికలు, దుంపలు, ఎండిన పండ్లు, బియ్యం, గోధుమలు మొదలగు కాయ ధాన్యాలు; మినుములు, పెసలు మొదలగు పప్పు ధాన్యాలు; నువ్వులు, కొబ్బరి, బాదం, అక్రోటు మొదలగు తైలయుక్త గింజలు, కాయలు; నీళ్ళు కలియని పాలు, ఆవునెయ్యి మొదలగునవి ఈ వర్గంలోనికి వచ్చును. ఇవి అగ్నిలో వాయురూపాన్ని చెంది ప్రాణులకు పుష్టిని, బలాన్ని కలిగించును.

3. రోగ నాశకాలు: అన్ని రకాల మూలికలు, సోమ లతాది వనస్పతులు ఈ వర్గంలోనికి వచ్చును. వ్యాధుల నివారణకు, అంటువ్యాధుల నిరోధానికి వివిధ వాతావరణ కాలుష్యాలకు ఒక చికిత్సగా ఆ యా పరిస్థితుల ననుసరించి ఆ యా మూలికల నెంచుకొన వలసి యుండును. ఋతువులను బట్టి కూడా

మూలికల నెంచుకొన వలసి యుండును. వీటిని గురించి వివరంగా మరియొక ప్రకరణంలో తెలుసుకొందము.

4. మిష్టములు (స్వాదిష్ట - తీపి పదార్థాలు) : బెల్లం, చక్కర , తేనె, కర్పూరం మొదలగునవి ఈ వర్గానికి చెందును. ఇవి పుష్టికరములేగాక ఇతర హవ్య పదార్థాలలోని తీక్షణతలను, ఎక్కువ తక్కువలను సమరసపరచి మధుర వాసనలను వెదజల్లును.

స్థాలీపాకం ఈ వర్గానికి చెందును. పాలు, నేతితో వండిన ముద్గోదనము (తీపి వంటకము), పాయసాన్నము (ఖీరు, హల్వా), మోహన భోగము (మిఠాయిలు) మొదలగునవి. ప్రత్యేకంగా హవనం కొరకు వండిన వాటిని స్థాలీపాకమందురు. ఇవి కూడా పుష్టి కారకములే.

## సమిధలు

అగ్నిహోత్రానికి బొగ్గుగా మిగులకుండా కాలి భస్మమగు సమిధలనే (కట్టెలనే) ఉపయోగించవలెను. వాటిలో పంచ పల్లవాలుగా వ్యవహరింపబడు మామిడి, మోదుగ, మేడి, రావి, జువ్వి సమిధలు శ్రేష్ఠము. వీటిలో కొంత ఓషధీ ప్రభావముంటుంది. మద్ది, మారేడు, తులసి, రుద్రజడ మొదలగు వాటి కట్టెలనుకూడ ఉపయోగించవచ్చును. విదేశాలలో ఈ కట్టెలు దొరకక పోవచ్చును. అట్టిచోట్ల ఓక్, లేవెండర్, యూకలిప్టస్ మొదలగు కట్టెలు వినియోగించవచ్చును. వీటితో బాటు మంచిగంధపు చెక్కలు వేయవచ్చును. పర్జేష్టి, పుత్రకామేష్టి మొదలగు యజ్ఞాలలో ఆ యా విధులలో సూచింపబడిన సమిధలను పై వాటితో కలుపవలెను. అడవులు, వృక్షసంపద తగ్గిపోవుట వలన పైన సూచించిన సమిధలు దొరుకుట కష్టంగానే యున్నది. గాన, అసలు మానుటకన్న దొరికిన వాటితోనే అగ్నిహోత్రం చేయుట మంచిది. అయితే పుచ్చినవి, చెదలు పట్టినవి, మాలిన్యంతో కూడినవి, చాలా పాతవి వాడరాదు. తాజాగానున్న ఎండిన సమిధలను సేకరించుటకు ప్రయత్నించవలెను.

కొందరు సమిధలకు బదులుగా ఆవు పిడకలను

ఉపయోగించుచున్నారు. అందు శాస్త్రీయ ప్రమాణమేమో తెలియదు. వేదం **'సమిధా అగ్నిం దువస్యత'** (యజు. 3-1) సమిధలతో అగ్నిని చక్కగా జ్వలింపజేయ' వలెనని బోధించును. బ్రాహ్మణ ఆరణ్యక గృహ్య సూత్రాది గ్రంథాలలో కూడా సమిధలతోనే హవనం చేయవలెనని ఉన్నది. గాన, సమిధలతో చేయుటయే మంచిది. ఇంతియేగాక, వైజ్ఞానికంగా కూడ జ్వలించుచున్న అగ్నిలో వేసిన ఆహుతియే ఎక్కువలాభకారి యగును. అట్టి అగ్నియే హవ్యమును అణువులుగా, పరమాణువులుగా మార్చగలదు. ఆవుపిడక లగుటవలన యజ్ఞ భస్మంలో కొంత ఓషధీగుణము లుండవచ్చును. కాని, పిడకల మందాగ్నిలో వేసిన ఆహుతి స్థూలంగా పొగతో కూడిన వాయువుగా పరిణమించును. దానివల్ల కొద్ది ప్రయోజనమే కలుగును.

ఆవుపిడకలను సమిధలుగా ఉపయోగించు ఆచారము మధ్యకాలీనం కావచ్చును. ఏలనన కొన్ని కర్మకాండ గ్రంథాలలో అచ్చటచ్చట అరుదుగా ఆవుపిడకలతో హోమం చేయవచ్చునని ఉన్నది. అయితే ఆ పిడకలు అడవిలో స్వేచ్ఛగా మేత మేయుచు తిరుగు ఆవుల పేడ దానికదిగా ఎండినదై యుండవలెనని చెప్పుదురు. గాన, కృత్రిమాహారాన్ని సేవించని, ఏ అనారోగ్యము లేని ఆవుపేడతో చేసిన పిడకలను సమిధలుగా వాడిన కొంత మేలు జరుగును. ఆ భస్మం (కచ్చికలు) కొన్ని రోగాలను పోగొట్ట గలుగును.

సమిధలను గురించి ప్రాచీన గ్రంథాలలో ఈ క్రింది ప్రమాణాలు కనబడుచున్నవి. అందు కొన్నిటి పేర్లు తెలియుట లేదు. ఆ యా సమిధల ఫలితాలు గూడ వ్రాయబడియున్నవి. వాటిని గురించి పరిశోధన చేయవలసి యున్నది.

**ఫలాశ ఫల్గు న్యగ్రోథా ప్లక్షాశ్వత్థ వికంకతాః ।**
**ఉదుమ్బర స్తథా బిల్వా శ్చందనో యజ్ఞీయశ్చయే ॥**

ఫలాశ (మోదుగ), ఫల్గు (అత్తి), న్యగ్రోథా (మఱ్ఱి), ప్లక్ష (మఱ్ఱిఊడలు), అశ్వత్థ (రావి), వికంకతాః, ............., ఉదుమ్బర (మేడి), బిల్వ (మారేడు) మరియు చందన సమిధలు అగ్నిహోత్రానికి ఉపయోగపడును.

సరలో దేవదారుశ్చ శాలశ్చ ఖదిర స్తథా ।

సమిదర్థే ప్రశస్తాః స్యు రేతే వృక్షా విశేషతః ॥ (ఆహ్నిక సూత్రావళి)

సరల (జాజికాయ చెట్టు), దేవదారు, శాల (ఒక పొడుగైన అందమైన వృక్షము), ఖదిర (కవిరి (చండ్ర) చెట్టు) మొదలగు వృక్షముల సమిధలు కూడా ప్రశస్తమైనవే.

సమిధల ఫలితాలు :

**అర్కీ నాశయతే వ్యాధిం, ఫలాశీ సర్వకామదా।**

**ఖాదిరీ త్వర్థలాభాయా, అపామార్గీ చేష్టవర్ధనీ ॥**

**ప్రజాలాభాయ చాశ్వత్థ, స్వార్గాయోదుమ్బరీ భవేత్ ।**

**శమీ శమయతే పాపం, దుర్వా దీర్ఘాయు రేవచ ।**

**కుశాః సర్వార్థ కామానాం పరమం రక్షణం విదుః ॥**

(వశిష్ఠీ యజ్ఞ పద్ధతి)

వీటిని పరిశోధించి కీ॥ శే॥ పండిత వీరసేన్ వేదాశ్రమీ (ఇండోర్) గారు కొన్ని ప్రయోగాలు చేసి వారి అనుభవాలను ఈ విధంగా తెలిపిరి.

1. శాంతి కొరకు – పాలు, నేయి, పిప్పలాది ఆకులు, తిప్పతీగ
2. పుష్టి కొరకు – బిల్వ పత్రాలు, నెయ్యి, మల్లెపువ్వులు
3. సమృద్ధి కొరకు – పెరుగు, నెయ్యి
4. అయుర్వృద్ధికి – నెయ్యి, నువ్వులు, దూర్వ (ఒకరకమగు గడ్డి), మామిడి ఆకులు
5. జ్వర నివారణకు – మామిడి ఆకులు
6. మృత్యువు దూరమగుటకు – తిప్పతీగ
7. గోవుల రోగముల నివారణకు – తెల్ల ఆవాలు
8. వర్షముల కొరకు – ఫేము బెత్తపు సమిధలు మరియు ఆకులు
9. అతి వర్ష నిరోధమునకు – పాలు, ఉప్పు.

## అగ్నిహోత్రములో వేయకూడనివి

ఉప్పు, పులుపు, కారం కలిగిన వంటకాలను అగ్నిహోత్రంలో వేయరాదు. వాటివల్ల మేలు కలుగకపోగా కొంత కీడు కలుగును. పట్టువస్త్రాలు లేదా చీరలు మొదలగునవి వేయు ఆచారం మంచిది కాదు. గుడ్డ కాలిన వాసన మంచిగా ఉండదు కదా! పగడము, ముత్యము మొదలగునవి వేయుట వలన అవి భస్మ మగునేకాని వాయు రూపమున పరిణమించి మేలుచేయవు. బంగారం, వెండి, పైసలు (నాణెములు) వేయుటవలన లాభమేమి? వాటి రంగు రూపాలు మారి చెల్లకుండా పోవునేగాని, ఏమి ప్రయోజనము? వీటన్నిటిని పేదలకు పంచిన వారికెంతో మేలు జరుగును. మనకు పుణ్యం లభించును.

ఇక వివిధ మాంసాలతో ఆహుతులిచ్చుట వలన పాపమే వచ్చును కాని పుణ్య మెట్లు కలుగును? హింస ఏ రూపంలో నున్నను పాపమే కదా! మద్యంతోనూ, వీర్యం (శుక్రము) తోను కూడ ఆహుతు లివ్వవలెనను ఆచారాల వెనుక తంత్ర గ్రంథాల ప్రభావమే యుండియుండును. కాని, వైదిక సాహిత్యంలో అట్టి మాటలు లేనేలేవు.

<u>పరమాణు పరిశోధనల కాలుష్య నివారణ :</u>

పరమాణు పరిశోధనల వలన వాతావరణ మంతయు చెడిపోవుచుండుట లోక విదితమే. అట్లు చెడిపోకుండా నివారించుటకు ఎన్నో ప్రయత్నాలు జరుగుచున్నను ఇంతవరకు తృప్తికరమైన ఫలితాలు కలుగలేదు. యజ్ఞం ద్వారా అట్టి దుష్ఫలితాలను నివారింపవచ్చును. ఇట్టి పరిశోధనలు చేయు స్థలానికి దూరంగా నాలుగు వైపులా మరియు నాలుగు మూలలయందు (అనగా చుట్టూ 8 వైపుల) పెద్ద పెద్ద హవన కుండాలను ఏర్పర్చి ఒక వారం ముందునుండి విశేష ద్రవ్యాలతో హోమం చేయుచు వచ్చిన ఈ దోషాలను చాలా వరకు నివారింపవచ్చును. పరిశోధనానంతరం కూడా ఒక వారం ఈ యజ్ఞం జరుగుచుండవలెను. దీనికి యజుర్వేదంలో ఒక ప్రేరణ కనబడుచున్నది. '**కస్త్వా విముంచతి । సత్వా విముంచతి ।**' అనగా దేనివలన ప్రాణులకు వాతావరణ దోషాల బాధావిముక్తి కలుగునని ప్రశ్నించుకొని

అగ్నిహోత్రం వలన మాత్రమే బాధావిముక్తి కలుగునని సమాధానం చెప్పబడింది.
కాని ప్రయత్నించుట మంచిది.

## వర్షేష్టి (వర్షాల కొరకు అగ్నిహోత్రం) కృత్రిమ వర్ష ప్రయోగం

మన రాష్ట్రంలో ముఖ్యంగా తెలంగాణా, రాయలసీమ ప్రాంతాలలో కొన్ని సంవత్సరాలుగా వర్షాలు పడనందున జలాభావస్థితి ఏర్పడింది. పంటలు నామమాత్రంగా ఉన్నవి. త్రాగునీటి సమస్య కూడా ఎదురగుచున్నది. ఇట్టి పరిస్థితిలో కృత్రిమ వర్షాల కొరకు ప్రయత్నం జరుపుట అవసరమే. ఆధునిక ప్రయోగాల వల్ల కొద్ది ప్రయోజనం కలుగుచున్నను ఆర్థిక భారం ఎక్కువగా ఉన్నది. అందుచే శ్రేష్ఠమైన, అల్పవ్యయంతో విస్తృత ప్రయోజనం కలుగు ఉపాయాలను అన్వేషించుట ఎంతైనా అవసరం.

ప్రాచీన భారతీయ చరిత్రను పరిశీలించినచో వర్షాలకొరకు వర్షేష్టి యజ్ఞాలు నిర్వహించి ఎంతో లాభం బొందినట్లు గనబడును. ప్రాచీన ఋషులు ఎంతో తపించి నిర్మించిన విజ్ఞాన శాస్త్రాలను విదేశీ దురాక్రమణదారులు చాలావరకు నశింపజేసినను స్వల్పంగా మిగిలియున్నవి. ఆ విజ్ఞాన గ్రంథాలు స్వల్పంగానున్నను ఆ విజ్ఞానాలకు ఆధారమైన వేదాలు సురక్షితంగానే యున్నవి. వాటిని మరల మనం అధ్యయనంచేసి, మనన చింతనలు చేసిన తప్పక ఆ విజ్ఞానాన్ని వెలుగులోనికి తీసుకురావచ్చును. మహర్షిదయానందుడు అట్టి ప్రయత్నాన్నే చేశారు. వారు వేదాలకు పూర్తిగా భాష్యం వ్రాయలేకపోయినా యజ్ఞవిజ్ఞానం గల యజుర్వేదానికి పూర్తిగా భాష్యం వ్రాశారు. అందు యజ్ఞం (అగ్నిహోత్రం) వల్ల కలుగు లాభాలెన్నిటినో సూత్రప్రాయంగా సూచించిరి. యజ్ఞాలవల్ల ముఖ్యంగా అగ్ని, గాలి, నీరు శుద్ధమగుననియు, దోషరహితమగుననియు హేతు బద్ధంగా వివరించిరి. తద్వారా భూమిపై ప్రాణి మనుగడ సుఖవంత మగుననియు అనేక సందర్భాలలో ఆ వేద భాష్యం నందు వివరించిరి.

యజుర్వేదం 'వర్ష వృద్ధమసి' (య. 1-16) 'వర్షమును వృద్ధిచేయుము'

అని ప్రేరణనిచ్చును. అందుకు యజ్ఞము, వాయువు, సూర్యకిరణాలు అవసరమనియు సూచించును. అందు యజ్ఞం (అగ్నిహోత్రం) వలననే వాయు, సూర్యకిరణాలను మన కనుకూలముగా మార్చుకొనవచ్చును. అందుచేతనే యజ్ఞమును 'వృషణం' (య. 34:14) వర్షమునకు హేతువనియు, 'వృషాసి' (య. 22:19) యజ్ఞాగ్ని వర్షాన్ని కలిగించుననియు వేదం చెప్పును.

వర్షాన్ని – నీటిని కోరు మనం ముందుగా నీరు ఎచటెచట లభించునో తెలుసుకోవలసియున్నది. అందుకు వేదం ఏమి చెప్పునో గమనించుడు.

**"పయః పృథివ్యాం, పయ .... ఓషధీషు, పయో దివ్యంతరిక్షే, పయో ధాః" ॥ - యజుర్వేదం (28-36)**

పయః అనగా పానయోగ్యమైన శుద్ధ జలము. అది భూమిపైన, లోపలగలదు. 'ఓషధీషు' ఓషధులలో - వృక్ష, లత, ఫల శాకాదులలో రసరూపమున నీరుండును. 'అంతరిక్షే' అంతరిక్షమునందు, అంతకన్న పైన గల ద్యులోకమునందు జలము గలదు. అట్టి జలం నాకు అన్ని దిక్కులనుండి లభించుగాక!

ఈ పై వేదమంత్రంలో భూమియందేగాక అంతరిక్ష ద్యులోకాలలో (సూర్య చంద్ర నక్షత్రాదులలో) నీరు గలదని చెప్పబడినది. అంతరిక్షం నందు నీటియావిరిగా – మేఘాలుగా ఉన్నదని ఆధునిక విజ్ఞానం అంగీకరించును. ఇక ద్యులోక జలమును గూర్చి నేటి విజ్ఞానానికి తెలియదు. ద్యులోక మనగా – సూర్య చంద్ర గ్రహ ఉపగ్రహములుండు స్థానము–లోకము. అందు నీరు అత్యంత సూక్ష్మంగా (సోమరూపమున) ఉండునని యజుర్వేదం చెప్పును.

యజుర్వేదమున మరియొక చోట (య. 23-47,58) **'కిం సముద్ర సమం సరః'** అని ప్రశ్నించుకొని సమాధానంగా **'ద్యౌః సముద్ర సమం సరః'** – ద్యులోకమే సముద్రము వంటి జలస్థానమని చెప్పును. గాన అంతరిక్షమందు జలం లభింపని పక్షమున ద్యులోకం నుండి వర్షాన్ని తెచ్చుటకు ప్రయత్నించవలసియున్నది. అది ఏ విధంగా రాబడునో కూడా యజుర్వేదం సూచించును.

**పూర్ణా దర్వి పరాపత సుపూర్ణా పునరాపత ।**
**వస్నేవ విక్రీణావహా౨ ఇష మూర్జం.... శతక్రతో ॥**

(యజుర్వేదం-అధ్యాయం 3. మంత్రం 49)

మనం హోమయోగ్యమైన పదార్థాలతో పూర్ణంగా ఆహుతుల నిచ్చిన అవి అంతరిక్ష ద్యులోకాలను చేరి, అచ్చట జలంతో కలిసి 'సుపూర్ణ' మగును. తదుపరి 'పునరాపత' అనగా ఆహుతుల విశేషం అచట జలంతో కలిసి తిరిగి భూమిపై వర్షించును. ఈ కార్య మెటులున్న దనిన తగిన మూల్యం చెల్లించి అంగడిలో వస్తువులను బడయు వైశ్య - వ్యాపారక్రియగా నున్నది.

అనగా యజ్ఞమే - అగ్నిహోత్రమే వర్షాన్ని పొందే మార్గం. మహర్షి మనువు కూడా ఈ విషయాన్నే ప్రతిపాదించును.

**అగ్నౌ ప్రస్తాహుతిః సమ్యగాదిత్య ముపతిష్ఠతే ।**
**ఆదిత్యాజ్జాయతే వృష్టిర్ వృష్టేరన్నం తతః ప్రజాః ॥**

(మను. 3-76)

యజ్ఞం నందు వ్రేల్చబడిన ఆహుతులు క్రమంగా వాయురూపం చెంది అంతరిక్షం చేరును. ఆ వాయువునందలి సూక్ష్మాంశం (ఉదజని, కొన్ని పరమాణు శకలాలు) క్రమంగా ద్యులోకమున ప్రవేశించి సూర్యుని చేరును. అచటినుండి సూర్యకిరణాలతో కలసి ద్యు అంతరిక్ష లోకాలందలి జలాన్ని వర్షరూపమున భూమికి తీసుకువచ్చును. ఆ వర్షజలంతో అన్నాదులు కలుగుటయు, తద్వారా ప్రాణులు జీవించుటయు జరుగుచున్నది.

యజుర్వేదంలో యజ్ఞం వలన కలుగు అనేకానేక ప్రయోజనములు వివరింపబడినవి.

**"వసోః పవిత్రమసి శతధారం, వసోః పవిత్రమసి సహస్రధారమ్ ।**
**దేవస్త్వా సవితా పునాతు వసోః పవిత్రేణ శతధారేణ సుప్వా కామధుక్షః ॥**

(యజుర్వేదం 1-3)

ఓ యజ్ఞమా! నీవు నూరు రకాల ప్రయోజనకారివి. వేల విధాల

ప్రయోజనాలను గలుగజేయుదువు. పవిత్రపరచుటలో నీవు ఉత్తమోత్తమమైన దానివి. కోరిక లను దుగ్ధాన్ని కురిపించు కామధేనువువు.

**"వసుభ్యస్త్వా రుద్రేభ్యస్త్వా ఆదిత్యేభ్యస్త్వా సంజానాథామ్**
**ద్యావా వృథివీ మిత్రావరుణౌ త్వా వృష్ట్యావతామ్ ।**
**వ్యన్తు వయోక్తం రిహాణా మరుతాం పృషతీర్గచ్ఛ వశా**
**పృశ్నిర్భూత్వా దివం గచ్ఛ తతో నో వృష్టిమావహ ।**
**చక్షుష్పాఽ అగ్నేఽసి చక్షుర్మే పాహి ॥** (యజుర్వేదం 2-16)

ఓ యజ్ఞాగ్ని! నీ యందు అర్పించబడిన ఆహుతి వలన వసుదేవతలు అనగా ప్రాణులు వసించ జీవించ యోగ్యమగు పంచభూతాలు, అందుకు తోడ్పడు సూర్య చంద్ర నక్షత్రాదులు పుష్టివంతమగును. రుద్రదేవతలు అనగా ప్రాణుల శరీరమందలి పది విధములుగా పనిచేయు ప్రాణవాయువు సంస్కరింపబడి బలపడును. ఆదిత్యుడు అనగా తాపభేదంతో పన్నెండు మాసాలలో నుండు ద్వాదశాదిత్యులు (సూర్యకిరణాలు) చైతన్యవంతమగును. ద్యులోక పృథివీలోకాల మధ్యన నుండు అంతరిక్షం పూర్ణ ప్రయోజనకారి యగును. మిత్రావరుణులు అనగా ప్రాణవాయువు మరియు ఉదజని వాయువులు దీనివలన బలపడి వర్షాన్ని కురిపించుటలో సహాయకములగును. ఈ క్రియ ఎటులున్నదన పక్షులు తమ కనుకూలంగ గూళ్ళను నిర్మించుకొని అందు నిరాటంకముగా నివసించునటు లున్నది. అగ్నియందు శ్రద్ధతో నీయబడిన ఆహుతి వాయువులో కలిసి అంతరిక్షాన్ని చేరి అందు స్థిరపడుచున్నది. (దివం గచ్ఛ) అచటనుండి ద్యులోకానికి చేరి (తతో నః వృష్టిమావః) అచటినుండి మాకు వర్షాన్ని తెచ్చును. ఇంతేగాక, ఈ యజ్ఞాగ్ని నేత్రాలను రక్షించుశక్తి గలది. గాన (**చక్షుర్మే పాహి**) అది నా నేత్రాలను కాపాడును గాక!

పై వేదోపదేశం ఎంతవరకు విజ్ఞాన సమ్మతమో పరీక్షించవలసి యున్నది. వర్షకామనతో చేయు వర్షేష్టియజ్ఞం ఆరంభయ్యట చేయవలసియుండును. భూమిపైన పెద్ద యజ్ఞవేదికను నిర్మించవలెను.

నాలుగువైపుల యజమానులు (యజ్ఞకర్తలు); యజ్ఞవిజ్ఞానం తెలిసి చక్కగా సద్గమంత్రోచ్చరణ చేయగల విద్వాంసులు వారి వారి స్థానములందు ఆసీనులై శ్రద్ధతో దీనిని ఆచరించవలెను. వర్షేష్టికి అవసరమగు ఆవునేతిని, ఆవుపాలను, సమిధలను, మూలికలను తగినంతగా సేకరించి అందుబాటులో నుంచుకొనవలెను.

యజ్ఞక్రియ వలన యజ్ఞవేదిక చుట్టూ నుండు గాలి వేడెక్కును. వేడెక్కిన గాలి తేలికయై పైకెగయును. ఆ ఖాళీ ప్రదేశాన్ని దూరంగా నున్న గాలి ఆక్రమించును. అదియును వేడెక్కి పైకెగయును. ఇట్లు వేడిగాలి భూమిలోనికి పంపు బర్మా (బోరింగ్) వలె అంతరిక్ష ద్యులోకముల వైపుకు (పైకి ఆకాశంవైపుకు) పయనించును. ఆ తాపవాయువు మేఘాలను ఆకర్షించును. సమీపించుచున్న మేఘాలయందు ఘృతాణు మిశ్రిత యజ్ఞవాయువు వ్యాపించి అందు స్థిరపడును. ఘృతం నీటిపై తేలుచుండుట మనము చూచినదే. అట్లే మేఘము నందలి జల అణువులపై నేతి అణువులు చేరును. అందుచే అవి భారవంతమై వర్షించుట జరుగును. ఇంతేగాక నేతికి శీతలమును అతి తొందరగా గ్రహించుగుణ మున్నది. దానివలన కొద్దిపాటి శీతల వాయువు ఆ మేఘాలకు తాకినను ముందుగా నేతి అణువులు దానిని గ్రహించి నీటి అణువుల కిచ్చును. అందుచే అవి భారయుతమై వర్షించును.

నేతి అణువులతో కూడిన యజ్ఞవాయువు మేఘాలు వర్షించుటకు తోడ్పడుటయేగాక మేఘాలను కూడా నిర్మించగలదు. ఎట్లన అంతరిక్షమున నీరు నీటియావిరి రూపమున (తేమరూపమున) ఎప్పుడును ఎంతోకొంత యుండును. అందు ఘృతాణుయుక్త యజ్ఞవాయువు వ్యాపించుటచే వాతావరణంలోని తాపభేదములవలన ఏ కొద్ది శీతలము తగిలినను నేతి అణువులు దగ్గరగుటకు (పేరుకొనుటకు) ప్రయత్నించును. వాటితోపాటు నీటి అణువులును దగ్గరై మేఘాల నిర్మాణం జరుగును. అందుచే **'యజ్ఞాత్ భవతి పర్జన్యః'** – యజ్ఞము వలన మేఘాలు నిర్మాణమగునని చెప్పిన శ్రీకృష్ణుని వచనాలలో అతిశయోక్తి ఏమున్నది?

ముఖ్యంగా వర్షేష్టియందు ఆవుపాలు మొదలగు నీటి శాతం ఎక్కువగా గల ద్రవ్యాలను ఆహుతులుగా నిత్తురు. అవియును గాలిలోని నీటి శాతాన్ని కొంతవరకు పెంచును. విశేషమూలికలతో కూడిన హోమద్రవ్యాలు మరియు సమిధల ప్రభావమును మేఘ నిర్మాణమునకు మరికొంత దోహదం చేయును. పరిశోధనలు చేయుకొలది-ఆ యా ద్రవ్యాలను విశ్లేషించుకొలది ఆ సత్యములు బయటపడును. **'అద్రి రసి వానస్పత్యః'** వనస్పతులతో అద్రి-మేఘాలు నిర్మాణమగు నను ఈశ్వరవాణి (వేదవాణి) నిరర్థక మెందు కగును?

నేడు విజ్ఞానవేత్తలు మేఘాలు రెండు రకాలుగా (ఉష్ణ శీతల మేఘాలుగా) ఉండునని చెప్పుచున్నారు. అందు మన దక్షిణదేశంలో ఉష్ణమేఘాలే ఎక్కువగా వచ్చుననియు వాటికి తగినంత చల్లనిగాలి లేక చల్లదనం తగిలినపుడే వర్షించుననియు చెప్పుచున్నారు. విమానాల ద్వారా నిర్వహించే Cloud Seeding ప్రక్రియలో శీతల మేఘాలమీద సిల్వర్ అయోడైడ్ పదార్థాన్ని, ఉష్ణమేఘాల మీద ఉప్పు మరియు మెగ్నీషియం సిలికేట్‌ల మిశ్రమాన్ని పొడిగాచేసి చల్లుదురు. ఈ రెండు రకాల మేఘాలే గాక అద్రి, గ్రావ, పర్వత, అహిః, మేఘ, అభ్ర, వృత మొదలగు పదిహేను రకాల మేఘాలున్నట్లుగా వేదములందు కనబడును. ఇవి అన్నియు మేఘాల వివిధ స్థితులను సూచించునవే. ఆ సమయమున మేఘాల స్థితిని గుర్తించి అందుకు తగిన మూలికలతో ఈ వర్షేష్టి యజ్ఞం చేయవలసి యుండును. అనగా రోగమొకటే అయినను రోగుల శరీరతత్త్వాన్ని బట్టి వైద్యుడు ఔషధం నెన్నుకొనునట్లు మేఘాలస్థితిని బట్టి మూలికాదులను ఎన్నుకో వలసి యుండును.

సామాన్యంగా యజ్ఞకార్యాన్ని హోతా, అధ్వర్యుడు, ఉద్గాతా, బ్రహ్మ అను నలుగురు కలిసి నిర్వహింతురు. కాని, వర్షేష్టి యజ్ఞమునకు పై నలుగురితో పాటు వర్షేష్టి నిర్వహించగల మరికొందరు విద్వాంసు లవసరమగునని వేదము చెప్పును.

**హోతాధ్వర్యు రావయాః అగ్నిమింధో**
**గ్రావగ్రాభ ఉత శంస్తా సువిప్రః ।**

తేన యజ్ఞేన స్వరంకృతేన స్విష్టేన
వక్షణా౨ ఆ పృణధ్వమ్॥
(యజుర్వేదం 25-28)

వారెవరన - హోతా అధ్వర్యులే గాక (**ఆవయాః**) యజ్ఞ సంగతీకరణం చేయగలవారు, దానం గ్రహించుటకు పాత్రులు (**అగ్నిమింధః**) తగిన వేడిని కాపాడువారు, (**గ్రావగ్రాభః**) మేఘాలను స్వీకరించువారు - అనగా మేఘాల స్థితిని, వాటిలోని పరిణామాలను గుర్తించుచు తగిన మూలికా ఘృతాలను నిర్ణయించువారు, (**శంస్తా**) చక్కగా వేదమంత్రాలతో పరమేశ్వరుని, పరమేశ్వర రచిత పదార్థాలను స్తుతించువారు, (**సువిప్రః**) చక్కటి వివేక బుద్ధి కలవారు ఇట్టివారితో కూడిన '**యజ్ఞేన స్వరం కృతేన స్విష్టేన, సుశోభిత**, సుస్వర వేద ఘోషతోచేయు వర్షేష్టియజ్ఞము వలన (**వక్షణా ఆ పృణధ్వమ్**) నదులు, చెరువులు మొదలగునవి జలంతో నిండిపోవును.

పై వేదమంత్రంలో గ్రావగ్రాభః, స్వరంకృతేన అను పదములు మేఘాలను ఆకర్షించుటలో, వర్షింపజేయుటలో ప్రభావవంతమైన ధ్వని అవసరమని తెలుపుచున్నవి. "**స్తోమైర్వత్యసా వావృధే**" వేదమంత్రాలతో మేఘాలు నిర్మితమగునని మరియొక సందర్భమున వేదం సూచించుచున్నది. గాన చక్కటి ఉచ్చస్వర వేదమంత్రోచ్చారణతో వర్షేష్టి నిర్వహించవలసి యుండును. వేదేతర మానవకృత శ్లోకాదులకు అట్టి శక్తిలేదు. ఏలనన వేదములందు సప్తవిధ ఛందస్సు లుండును. అవి ఏవనగా గాయత్రీ, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతీ, పంక్తీ, త్రిష్టుప్, జగతీ - వీటికి వరుసగా షడ్జః, వృషభః, గాంధార, మధ్యమ, పంచమ, ధైవత, నిషాద స్వరము లుండును. వీటి నుండే స, రి, గ, మ, ప, ద, ని అను సప్త సంగీత స్వరము లుద్భవించెనని చెప్పుదురు. ఈ వేదస్వరములవల్ల కలుగు ధ్వని తరంగాలు వాతావరణంపై తమ ప్రభావాన్ని చూపును. ఆ ప్రభావశక్తిని ఋషులు పరిధులుగా కల్పించిరి. అవి భూమిపై నుండి వరుసగా పై అంతరిక్ష ద్యులోకాలలో వ్యాపించును. అనగా భూమినుండి కొంత ఎత్తువరకు గాయత్రీ పరిధి, ఆ పొరలో '**షడ్జః**' స్వర ప్రభావ ముండును. దానిపైన '**వృషభ,**' ఆపైన '**గాంధార**' ఈ రకంగా

చివరి పరిధిగా **'జగతి'** ఉండును. అందు చివరి స్వరము 'నిషాధ' స్వరము ప్రభావమును చూపును. ఏ పరిధినుండి మనకు నీరు లభించునో అట్టి ఛందస్స్వరములుగల మంత్రాలతో ఆహుతు లిచ్చిన అంతటి సూక్ష్మతర భేదంతో ఆహుతి మరియు స్వరముల ప్రభావం పనిచేసి అచటినుండి మేఘాల నాకర్షించి వర్షాన్ని కురిపించును. ఉదాహరణకు-

గాయత్రీఛందస్సునందు 24 అక్షరా లుండును. ఇది తక్కువ అక్షరాలు గల మంత్రం. దీనిని ఒకేక్రమంలో చదువుచు మంత్రం చివర స్వాహాకారం చేయుచు ఆహుతులిచ్చు చున్నయెడల ప్రతి ఆహుతికి ఆహుతికి మధ్యలో మంత్ర పఠనమునకు కొంత సమయం పట్టుచుండును. ఈ కొద్ది సమయంలో మనం వేసిన ఆహుతి కొంతవరకు సూక్ష్మీకరింపబడి వాయువులో కలియును. ఇది సూక్ష్మీకరింపబడినను కొంత స్థూలంగా నుండును. కొద్ది భారయుతంగా నుండును. అందుచే భూమ్యాకర్షణ శక్తిని మించి పైకి పోజాలకుండును. అది వర్షం ద్వారా మరల భూమిపైకి వచ్చును. అందుచేత గాయత్రీఛందస్సుతో కూడిన మంత్రాలద్వారా నిచ్చు ఆహుతుల వలన ఆ ఫలితం భూమండలం వరకే పరిమితమై యుండును. ఈవిషయమునే యజుర్వేదం **'పృథివ్యాం విష్ణుర్వ్యక్రగ్ంస్తగాయత్రేణ ఛన్దసా'** (యజు. 2-25) అని చెప్పును. ఆకాశంలో మేఘాలు ఉండి వాతావరణంలో తేమ సరిపడినంతగా నుండు నపుడు గాయత్రీఛందస్సుతో కూడిన చిన్న మంత్రాలతో ఆహుతులిచ్చుట వలన మేలు కలుగును. అట్లు లేనపుడు అంతరిక్ష ద్యులోకాలలో మార్పు తీసుకొని వచ్చుటకు ప్రయత్నించవలసి యుండును.

ప్రాచీన భారతీయ వైజ్ఞానికులు (ఋషులు) ఆకాశంలో మేఘాలు లేనపుడు కూడ మేఘాలను నిర్మింపజేయగల పద్ధతులను కనుగొనిరి. ఆ పద్ధతిలో అంతరిక్ష జలాలను ఆకర్షించి వర్షాన్ని కురిపించవవలసి యుండును. దానికొరకు పెద్ద పెద్ద హవన కుండముల నేర్పరచి త్రిష్టుప్ ఛందస్సుతో కూడిన మంత్రాలతో నాహుతుల నివ్వవలెను. ఈ మంత్రాలు 44 అక్షరములు కలిగియుండును. అందుచే గాయత్రీ మంత్రం పఠించు సమయంకన్న రెట్టింపు సమయం ఈ మంత్రోచ్చారణకు పట్టును. ఆ సమయంలో యజ్ఞాగ్ని రెట్టింపుగా

ప్రజ్వరిల్లును. ఆ ప్రజ్వరిల్లిన హోమాగ్నిలో వేసిన ఆహుతి మరింత సూక్ష్మాణువులుగా విడివడి పృథివీ మండలాన్ని దాటి అంతరిక్షాన్ని చేరును. దీనికి యజుర్వేదంలో ఈ ప్రేరణ కనబడుచున్నది. **"ద్విష్మోఽ న్తరిక్షే విష్ణుర్వ్యక్రగంస్త్రైష్టుభేన ఛన్దసా"** త్రైష్టుప్ ఛందస్సు అంతరిక్షమును వశపరుచుకొనునని దీని భావం. మేఘాల పైనుండు భాగాన్ని అంతరిక్షమని చెప్పవచ్చును.

ఈ ఆహుతుల ప్రభావం మేఘాల పైభాగాన నుండు నీటిని లేదా ఇతర గ్రహాలలో నుండు నీటిని ఆకర్షించి వర్షం కురిపించును.

ఇది ఫలించనపుడు చివరగా ఒక ప్రయత్నం చేయవలసి యుండును. సూర్యునిలో జరుగు మార్పులకు భూ వాతావరణానికి కొంత సంబంధమున్నది. సూర్యునిలో హైడ్రోజన్ హీలియం వాయువుల ఘర్షణ వలనను, హీలియం హైడ్రోజన్‌గా మారునపుడు వెలువడు రేడియోధార్మికశక్తి వలనను పెద్ద పెద్ద మంటలు లేచుచుండును. ఈ మంటలు సూర్యునిలో అంతటా ఒకేవిధంగా నుండక కొన్నిచోట్ల యెక్కువగాను, కొన్నిచోట్ల చాలా తక్కువగాను ఉండును. అవే మనకు దూరదర్శినిలో మచ్చలుగా కనబడును. వీటినే ఇంగ్లీషులో 'సన్‌స్పాట్స్' అందురు. ఈ సన్‌స్పాట్స్‌లోని మార్పులే భూమిమీద జరుగు వాతావరణ విపరీతములైన తుఫానులు, ఉప్పెనలు, అతివృష్టి, అనావృష్టి మొదలగు వాటికి కారణం. వీటిని సరిచేయ గలిగిన నాడు భూవాతావరణంలో ఇటువంటి ఉపద్రవాలు రావు. వాటిని సరిచేయుటకు భారతీయ వైజ్ఞానికులు ఒక యజ్ఞపద్ధతిని కనుగొనిరి.

వేదాలలోని సప్త ఛందస్సులలో జగతీఛందస్సు అన్నిటికన్న పెద్దది. ఈ ఛందస్సుతో కూడిన మంత్రాలు పఠించుటకు గాయత్రీ, అనుష్టుప్ ఛందస్సు మంత్రాలకన్న ఎక్కువ సమయం పట్టును. ఆ సమయంలో యజ్ఞాగ్ని చాలా పెద్దగా ప్రజ్వరిల్లును. అటుల పెద్దగా ప్రజ్వరిల్లిన అగ్నిలో వేసిన ఆహుతి చాలా సూక్ష్మాణువులుగా విడివడి భూమ్యాకర్షణ పరిధిని దాటి అత్యంత తేలిక యగుట వలన ఈ సూర్యకుటుంబంలో అన్నిటికన్న పెద్ద పరిమాణం గల గోళమైన సూర్యునివైపు ఆకర్షింపబడి సూర్యుని చేరును. అట్టివే ఉదజని,

కొన్ని పరమాణు శకలాలు. ఇవి సూర్యునిలో మార్పు తీసుకువచ్చు అవకాశమున్నది. ఈ విషయాన్ని యజుర్వేదం ఈ విధంగా సమర్థించును. **"దివి విష్ణు ర్వ్యక్రగ్ంస్త జాగతేన ఛన్దసా"** జగతీ ఛందస్సు దివిని (సూర్య నక్షత్రాదులుండు లోకాన్ని) వశపరచుకొనునని దీని భావం. మనువు ఈ విషయాన్నే **"అగ్నౌ ప్రస్తాహూతిః సమ్యగాదిత్య ముపతిష్ఠతే".** అగ్నిలో ఆహుతు లివ్వబడిన ద్రవ్యము లోని సూక్ష్మాంశం క్రమంగా పయనించుచు ఆదిత్యుని (సూర్యుని) చేరుతున్న"దని చెప్పెను.

పై విధంగా ప్రాచీనకాలంలో యజ్ఞంతోనే వాతావరణాన్నంతటిని తమ స్వాధీనపరచుకొని సుఖంగా జీవించిరని మన మూహించవచ్చును. నేటి వైజ్ఞానికులు ఈ మార్గంలో ఆలోచనలు సాగించి యజ్ఞం ద్వారా ప్రయోగాలు చేసిన తప్పక ఫలితాలు కలుగును. ప్రస్తుతం ఇండోర్ వాస్తవ్యులు పండిత వీరసేన వేదశ్రమీ గారు యిట్టి యజ్ఞాలను నిర్వహించుచున్నారు. వారు రచించిన **"వైదిక వృష్టి విజ్ఞాన్"** అను హిందీ గ్రంథంలో మరెన్నో వివరాలున్నాయి.

<u>వర్షం కురియుటలో మిత్రా వరుణుల పాత్ర :</u>

యజుర్వేదం (2-16) లో **"మిత్రా వరుణౌ త్వా వృష్ట్యా వతామ్"** అని చెప్పబడినది. అనగా వర్షం కురియుటలో మిత్రావరుణుల పాత్ర ముఖ్యమైనదని భావం. ఇచట మిత్రావరుణులు అనగా ఆక్సిజన్, హైడ్రోజన్‌లు. యజ్ఞం వలన ఈ రెండు వాయువులు పుష్టిని పొంది వర్షం కురియును. దీనిని అథర్వవేదం బలపరచుచున్నది.

**"మిత్రావరుణౌ వృష్టాధిపతీ తౌ మావతామ్"** (అథర్వ 5-24-5)

వర్షాధిపతులైన మిత్రావరుణులు మాకు అనుకూలు రగుదురు గాక! అని ప్రార్థన. నేటి వైజ్ఞానికులు గూడ వర్షం కురియుటలోను, కురియకపోవుటలోను వీటి పాత్రయున్నదని చెప్పుదురు. ఋగ్వేదంలో ఇట్టివే మరికొన్ని ఆలోచనలు కలవు. అగ్నిలో ఆహుతులిచ్చెడి కొన్ని పదార్థాలు వాయు, అంతరిక్షాల ద్వారా ద్యులోకమును జేరి మిత్రా వరుణులను సంయుక్తపరచి వాటిని నీటి ఆవిరిగా, మేఘాలుగా మార్చి వర్షింపజేయునని ఋగ్వేదం

(1-2-8) లో చెప్పబడినది.

ఇంతకుముందు వివరించినట్లు అగ్నిహోత్రం చేయుచున్నపుడు దాని నాలుగు వైపుల నుండి గాలి వేడెక్కి పైకిపోవుచుండును. క్రింద ఖాళీ అయిన ప్రదేశంలో దూరంగానుండు గాలి ఆక్రమించును. ఇట్లు గాలి వలయాలు యేర్పడుచుండును. ఆ ప్రాంతం లోని వాయువు వేడెక్కి నీటిని ధారణచేయుశక్తిని పెంచుకొనును. ఇంతేగాక, ఆహుతులలోని సోడియం సూక్ష్మాణువులు (న్యూక్లియస్)నేతి యొక్క సూక్ష్మాణువులు (హైడ్రోకార్బన్స్) నీటి ఆవిరిని ఎక్కువగా సేకరించు శక్తిని కలిగియుండును. దానివలన మేఘాలు తయారగు అవకాశమున్నది. కృత్రిమంగా వర్షం కురిపించు వైజ్ఞానికులు మనం ఇంతకు పూర్వం తెలుసుకున్న ప్రయోగం కన్న వేరుగా మరొక ప్రయోగం చేయుదురు. ఆకాశంలో విమానాల ద్వారా సోడియం మొదలైన రసాయనాలను జల్లుదురు. అవి నీటి ఆవిరిని ఎక్కువగా సేకరించి భారయుతమగును. వాటిపై చల్లని గాలి ప్రసరించిన వర్షించును. ఇదియును చాలా వ్యయంతోకూడిన ప్రక్రియయే. అంతేగాక, చాలా సూక్ష్మీకరింపబడిన (విభజింపబడిన) సోడియం మొదలైన రసాయనాలు మాత్రమే నీటిని సేకరించు శక్తిని కలిగి యుండును. అగ్నిహోత్రంలో సోడియం ఎక్కువగా గల మూలికలను వేయుటవలన అవి అత్యంత సూక్ష్మంగా విడగొట్టబడి గాలిలో కలిసి, అంతరిక్షమున ప్రవేశించి మరింత ఎక్కువగా నీటి యావిరిని ఆకర్షించి మేఘాల నుత్పన్నంచేయును.

సముద్రంలోని నీరు ఎండవేడికి ఆవిరగునపుడు కొన్ని సూక్ష్మాతిసూక్ష్మ సోడియం అణువులు (నూక్లియస్ అణువులు) నీటి ఆవిరితో కలిసి పైకిపోవును. వాటి ప్రభావం వలననే మేఘము లేర్పడును. అవి ఒత్తుగా జేరి భారవంతమై చల్లగాలి తగిలినపుడు వర్షించును. ఇది ప్రకృతిలో జరుగు సహజ వర్షేష్టి యజ్ఞము.

జలం నీటి యావిరి రూపమున అంతరిక్షంలోనేకాక ఇంకా పై భాగంలో కూడ నుండును. **"పయః పృథివ్యాం పయ ఓషధీషు పయో దివ్యన్తరిక్షే పయోధాః పయస్వతీః ప్రదిశః సన్తు మహ్యామ్"** (యజు. 18. 36) అని యజుర్వేదం

చెప్పును. అనగా జలం భూమి మీదను, లోపలను, వృక్షాలందును. అంతరిక్ష ద్యులోకము లందును ధరింపబడి యున్నది. వాటిని మేము మా అవసరాలకు ప్రయత్నపూర్వకంగా పొందుదుము గాక! అని ఈ మంత్రార్థం. భూమిలోని జలాన్ని మనం బావులు మొదలైన వాటిద్వారా త్రవ్విపొందుదుము. అట్లే అంతరిక్ష ద్యులోకముల నుండి కూడా జలమును పొందుదని ఈ మంత్రం ప్రేరణ నిచ్చుచున్నది. అందుచే వాతావరణాన్ని పరిశీలించి ఆ సమయానికి ఏ జలం లభించగలదో తెలుసుకొని అందుకు తగిన ప్రయత్నం చేయవలెను. ఒక్కొక్క సారి ఈ జలం చాలా అరుదుగా నుండును. ఆ స్థితిని వేదములు "శ్రధ" అని చెప్పును. ఆ స్థితిలో సోమము నుత్పన్నము చేయగల ఓషధులను ఆహుతు లివ్వవలెను. **(సోమ గచ్ఛ స్వాహా)** ఆ ఆహుతులు చాలా ఊర్ధ్వభాగమునకు పోయి 'సుపర్ణ'గా మారును. అవి క్రమంగా 'కద్రు'గా మారి ద్యులోకమునుండి (సూర్యనక్షత్రాదులుండు లోకము నుండి) వర్షమును తెచ్చును. ఇట్టి పద్ధతి మన ప్రాచీన శాస్త్రాలలో గలదు.

1961 జూన్ నెలలో ఒక చోట పండిత వీరసేన వేదశ్రమీగారు వర్షేష్టియజ్ఞం చేయుచూ ఈ క్రియలన్నిటిని ప్రేక్షకులకు ప్రత్యక్షంగా చూపించి యుండిరి. అందుచే ఈ విజ్ఞానాన్ని పెంపొందించుకొనుటకై ప్రభుత్వం తన ప్రోత్సాహ సహకారా లిచ్చినచో అనుకున్న సమయమున కనుకున్నచోట వర్షాలు కురిపించ వచ్చును. దీని సంబంధమైన మూలికల గురించి **'ఉద్దీష' తంత్రం వృష్టికామో వైతసేవిః సమిద్భే పత్రకేస్తథా'** వర్షము కొరకు **'వైతసీ'** పత్రాలతోను, ఎండుకొమ్మలతోను హవనం జేయవలెనని చెప్పును. నేటి విజ్ఞానాన్ని అనుసరించి హోమద్రవ్యంలో సిల్వర్ అయోడైడ్ అను రసాయనాన్ని ఎసిటోన్‌లో కరిగించి హోమద్రవ్యంలో కలిపి ఆహుతులివ్వవచ్చును. ముఖ్యంగా వర్షేష్టి యజ్ఞానికి ఆవునేతిని ఆహుతులుగా నిచ్చుట మంచిది.

## వర్షేష్టిలో స్వర ప్రభావం

వైజ్ఞానిక యజ్ఞప్రక్రియతో బాటు ఆహుతులిచ్చుచూ వేదమంత్రాలను పఠించుట ఎంతైనా అవసరం.

**'ఉపప్రయన్త + ఇత్యుప ప్రయన్తః, అధ్వరమ్, మన్త్రమ్,**
**వోచేమ, అగ్నయే, ఆరే, అస్మే ఇత్యస్మే, చ, శృణ్వతే'**

(యజుర్వేదం 3.11)

యజ్ఞం చేయునపుడు దూరంగా నుండు వారికి గూడా చక్కగా వినబడునట్లు ఉచ్ఛస్వరంతో మంత్రాల నుచ్చరించుచు నాహుతులివ్వవలెనని ఈ మంత్రం వివరించుచున్నది. యజ్ఞం చేయించు పురోహితులలో ఒకరిని 'హోత' అని అందురు. హోత అనగా దివ్యగుణాలను కలిగియుండు దేవతల (ప్రాకృతిక పదార్థాల) నాహ్వానించు వాడని అర్థం. యజుర్వేదంలో (24.38) 'వర్షాహూః' అను శబ్దము వచ్చును. అనగా వర్షాన్ని పిలుచువాడు అని అర్థం. మరియొక చోట **'గ్రావగ్రాహ'** అను విశేషణం గలదు. అనగా మేఘాల నాహ్వానించు వాడని అర్థం. మరియొక చోట **'గ్రావస్తోత'** అను విశేషణం వచ్చును. వీటిని బట్టి ధ్వని కూడా యజ్ఞప్రక్రియకు తోడ్పడునని యూహింపవచ్చును. శబ్దతరంగాలు వాతావరణంలో గొప్ప మార్పులను తీసుకువచ్చునని నేటి విజ్ఞానం గూడ చెప్పును. వీటిని గూర్చి చేసిన పరిశోధనలలో వేదమంత్రాలే ఇట్టి గొప్ప ధ్వని తరంగాలను కలిగింప గలవని రష్యా మొదలగు దేశాలలో చేసిన పరిశోధనలలో వెల్లడి యైనది. సంగీతంతో కూడా వర్షాలు కురిపించినట్లు మన ప్రాచీన చరిత్రలో అచ్చటచ్చట కనబడుచున్నది.

చరిత్ర గ్రంథాలలో తాన్‌సేన్ అను గాయకుడు 'మేఘమాలహార' రాగ మాలాపించినపుడు వర్షాలు కురియుచుండెడివని గలదు. దక్షిణ భారతంలో తిరుణల్‌వేళి జిల్లాలోని ఎట్టయ్యాపురం గ్రామంలో 200 సంవత్సరాలకు పూర్వం 12 సంవత్సరాలు వర్షాలు లేక మహా క్షామ మేర్పడింది. అప్పుడు ప్రఖ్యాత సంగీత విద్వాంసుడు ముత్తుస్వామి దీక్షితారు గారు 'అమృత వర్షిణీ' రాగ

మాలాపించి వర్షాలు కురిపించినారట. 1982 అక్టోబర్‌లో మద్రాసు నగరాన విపరీతమైన నీటికొరత ఏర్పడగా ప్రభుత్వం ప్రసిద్ధ వయోలిన్ విద్వాంసుడు కునకోడి వైద్యనాథన్ గారిని పిలిపించి వర్షదేవతలను తన సంగీతంతో ప్రసన్నం జేయగోరిరి. వారు 15 దినాలు మద్రాసు నగరానికి ముఖ్య నీటి కేంద్రమైన రెడ్‌హిల్స్ సరస్సులో మోకాలు లోతు నీటిలో నిలబడి ఎన్నుకొన్న కొన్ని రాగాల నాలాపించిరి. కొన్ని దినాల వరకు మేఘాలు కనబడుతూ వచ్చినవే గాని వర్షాలు పడలేదు. 9వ నాడు కొద్దిగా వర్షం పడింది. 15 దినాల వరకు ఆ ప్రయత్నాలు కొనసాగినవి. దానితో తృప్తిగా వర్షాలు పడినవి. వైద్యనాథన్‌గారు విలేఖరులతో మాట్లాడుతూ 'అమృత వర్షిణీ' రాగం వలన సముద్రంలో వేడి పుట్టి నీటియావిరి ఎక్కువగా విడుదలై మేఘములేర్పడెనని చెప్పిరి. అప్పుడు 'మేఘరంజనీ' రాగాన్ని ఆలాపించిన మేఘాలు దగ్గరగా కేంద్రీకృతమగుననియు, చివరగా 'వరుణప్రియ' రాగ మాలాపించిన వరుణ దేవతలు ప్రసన్నమై వర్షాన్ని కురిపింతురనియు తన అనుభవాన్ని చెప్పిరి.

ఇది ఎంతవరకు నిజమోగాని శబ్దతరంగాల ప్రభావం వాతావరణం పైనను, మేఘాల ఆకర్షణకొరకును సహకరించును. మంత్రం చివర స్వాహాకారం వలన ఉత్పన్నమైన శబ్దతరంగాలు యజ్ఞ వాయువులను సుదూర ప్రాంతాలకు చేర్చగలవు. మనం పూర్వం చెప్పుకొన్నట్లుగా ఛందస్సులలో నుండు అక్షరనియమం వలన ఆహుతికి ఆహుతికి మధ్య ఒక నియమిత సమయ మేర్పడుచుండును. మంత్రాలలో యజ్ఞక్రియవలన ఏఏ ప్రయోజనాలు కలుగునో వివరింపబడి యుండును. విశేష యజ్ఞ మంత్రాలలో ఏ ప్రయోజనాన్ని గోరి మనం యజ్ఞం చేయుచున్నామో, దాని కొరకు ఎట్టి ప్రయత్నం మనం చేయవలెనో వివరించు భావముండును. అందుచే ఆ పని యందు ఏకాగ్రత, శ్రద్ధ ఏర్పడును.

ప్రఖ్యాత జీవశాస్త్రజ్ఞుడు డాక్టర్ లయావేస్టన్ 'సూపర్ నేచర్' అను పత్రికలో ఒక వ్యాసాన్ని వ్రాయుచు ఈ క్రింది మాటలను వ్రాసెను. 'ఈ సృష్టి అంతయు శబ్ద తరంగాలతో నిండి యున్నది. వివిధ రకాల శబ్దతరంగాలతో గజిబిజిగా ఉన్నది. అయినప్పటికీ కొన్ని ఉపయోగకర శబ్దతరంగాలు వాటి

అస్తిత్వాన్ని కోల్పోవుటలేదు..... పెద్ద కంఠం కలవాడు అకస్మాత్తుగా పెద్దగా అరచిన శ్రవణ నాడులు తెగిపోవుచున్నట్లు గుర్తింపబడినది. అంతేగాక, పెద్ద అరపు ఒక అద్దపు గాజు తలుపును కొద్దిగా చిట్లించ గలిగినది. ఇప్పుడు మొక్కలపై సంగీత ప్రభావాన్ని గూర్చిన పరిశోధనలు జరుగుచున్నవి. సంగీతం వలన జెరానియం అను మొక్కలు తొందరగా పెరుగుటయే గాక పొడవుగా పెరుగుచున్నట్లు గుర్తింపబడినది....... బాక్టీరియాలు కొన్ని రకాల శబ్దతరంగాల వలన ఎక్కువగా వృద్ధి యగుచున్నవి. కొన్ని శబ్దతరంగాల వలన చనిపోవుచున్నవి'. ఈ మాటలను బట్టి శబ్దతరంగాల వలన ప్రాణులలోను, వృక్షజాతులలోను వాతావరణంలోను కొన్ని మార్పులు జరుగుచున్నవని అంగీకరించక తప్పదు. ఇది యెట్లు జరుగుచున్నదో శాస్త్రవేత్తలు అన్వేషించుచునే యున్నారు. కొన్ని వేదమంత్రాల సస్వర పఠనం, వరుణ మంత్ర జపం ఇట్టి ప్రభావాన్ని కలిగియున్నవని చెప్పవచ్చును.

ఋగ్వేదంలో (10 వ మండలంలోని 98 వ సూక్తంలో) వర్షేష్టిని గూర్చిన వివరమంతయు నున్నది. కాని పాశ్చాత్య విద్వాంసులు కొందరు ఈ సూక్తానికి భాష్యం వ్రాయుచు ఇందు ఒక రాజు చరిత్ర వర్ణింపబడినదని వ్రాసిరి. వారి ననుకరించు భారతీయ విద్వాంసులు కూడ అవే మాటలు చెప్పుచున్నారు. ఇది వాస్తవం కాదు. ఈ సూక్తంలో అర్ష్షేణ, దేవాపి మరియు శంతన పదములు వచ్చును. అవి వ్యక్తుల పేర్లు కావు. అర్ష్షేణుడు ఋర్ష్షేనుని యొక్క పుత్రుడని చెప్పబడినది. ఇచట ఋర్ష్షేణుడనగా మేఘాల సమూహం. అతని పుత్రులైన దేవాపి మరియు శంతనులు క్రమంగా విద్యుత్తు జలములు. అంతేగాని రాజుల పేర్లు కావు. ప్రాచీన భారతీయ ఋషుల వేద వ్యాఖ్యానాలైన బ్రాహ్మణ, ఆరణ్యకాలను పరిశీలించకనే మిడిమిడి జ్ఞానంతో పాశ్చాత్య విద్వాంసులు భాష్యాలు వ్రాసిరి. వేదాలలో చరిత్రలను జూపించి అవి సృష్ట్యాదిలో చెప్పబడినవి కావనియు, ఈశ్వరవాణి అసలే కాదనియు, రెండు మూడు వేల సంవత్సరాలకు పూర్వం అడవి మనుషులు పాడుకున్న పాటలనియు భ్రమింపజేయుటకు ఈ తప్పుడు కథలను ప్రచారం జేసిరి. ఈ తిప్పలన్నియు తమ బైబిలు మాత్రమే ఈశ్వరవాణి యని నమ్మించుటకు చేసిన కుట్రలే. ఇవి

గుర్తించలేని పాశ్చాత్య భావదాస్యులైన భారతీయ పండితులు ఆ మాటలనే నమ్మి వాటినే విద్యార్థులకు పాఠాలు చెప్పుచున్నారు. ఇది దురదృష్టకరమే.

యజుర్వేదంలో **'దివో వృష్టి మీరయః'** ఈ యజ్ఞం అంతరిక్షంలోని జలాన్ని వర్షింపజేయునని చెప్పబడినది. ప్రాచీనకాలంలో అనావృష్టి ఏర్పడిన ప్రాంతాలలో వర్షేష్టి యజ్ఞాలతో వర్షాలు కురిపించినట్లు చరిత్రలో కనబడుచున్నది. ఇండోర్ వాస్తవ్యులు కీ. శే. పండిత వీర్‌సేన్ వేదశ్రమీగారు, ఢిల్లీ, పానిపట్, జైపూర్, ఖాండ్వా, అజ్మీర్, షహపుర, భిలాస్‌పూర్, కరోరా, జాలన మొదలగు ప్రాంతాలలో వర్షేష్టి యజ్ఞాలు చేయుట వలన వర్షాలు పడినవి. ఒకచోట ఒక ఉపవనంలో ఎంతో కాలంగా ఒక మామిడిచెట్టు కాయలు కాయకుండ గొడ్డుగా నుండెడిది. వీరు అచట యజ్ఞం చేసిన మరు సంవత్సరమే ఆ చెట్టు పూవులు పూసి కాయలు కాచినది.

వేదం వర్షాల కొరకు ఒక చక్కటి ప్రేరణ నిచ్చుచున్నది. **'నికామే నికామే నః పర్జన్యో వర్షతు'** - మేము ఎప్పుడెప్పుడు వర్షాలు కావలెనని కోరుదుమో అప్పుడప్పుడు మా దేశంలో వర్షాలు పడవలె నను ప్రార్థనలు వేదాలలో కలవు. ఆ ప్రేరణలే వర్షేష్టి యజ్ఞంగా రూపొందినవి.

## ఋతువుల అనుకూలతకు అగ్నిహోత్రం

**ఋతవస్తే యజ్ఞం వితన్వస్తు మాసా రక్షన్తు తే హవిః ।**
**సంవత్సరస్తే యజ్ఞం దదాతు నః**
**ప్రజాం చ పరిపాతు నః ॥** (యజుర్వేదం. 26.14)

భావార్థం : మీరు చేయు యజ్ఞ యాగాదులవలన - అర్పించు ఆహుతుల వలన వసంతాది ఋతువులు, చైత్రాది మాసాలు, ప్రభవాది సంవత్సరాలు సంస్కరింపబడి యజ్ఞకీర్తిని విస్తృతి మొనర్చును. అట్టి సంస్కరింపబడిన వాతావరణం ప్రజలను అన్నివైపుల నుండి రక్షించును.

ఋతువులయొక్క అనుకూలతకు యజ్ఞాన్ని నిర్వహించవలసినదిగా పై వేదమంత్రం ప్రబోధించుచున్నది. ఆ యా ఋతువులకు తగిన పదార్థాల నాహుతు లిచ్చిన ఆ యా ఋతువులవలన ప్రాణులకు ఎక్కువ కష్టం

కలుగకుండును. ఋతువులవలననే ఈ భూమిపై ప్రాణులు జీవించ గలుగుచున్నవి. సూర్యునిచుట్టు తిరుగుచున్న ఈ భూమి నిటారుగా కాక 23 1/2 డిగ్రీల ఏటవాలుగా తిరుగుచున్నది. ఆరు నెలలు దక్షిణ ధృవం సూర్యుని వైపు వంగి తిరుగుచుండును. దీనివలన ఋతువు లేర్పడును. అవి సక్రమంగా వచ్చుటకు, న్యూనాధికములు లేకుండా నుండుటకు అగ్నిహోత్రం తోడ్పడును. వాటిలో ఏవైనా భేదాలు కలిగిన దానివలన ప్రాణులకు బాధ కలుగును. అప్పుడు వాటిని యజ్ఞంద్వారా సరిచేయవచ్చును. అందుకు అవసరమైన ఆ యా వనమూలికల వర్ణన, ఆ యా యజ్ఞపద్ధతులు మన ప్రాచీన శాస్త్రాలలో కలవు. వాటిని పరిశోధించవలసి యున్నది.

## యజ్ఞం వాతావరణ కాలుష్య నివారిణి

వాతావరణ నివారణకు యజ్ఞం ఎంతగానో తోడ్పడును. నేడు అత్యంత పారిశ్రామికీకరణ వలన కార్బన్ మోనాక్సైడ్, మెర్క్యురీయస్‌డైఅక్సైడ్ మొదలైన ఎన్నో రసాయనాలు గాలిలో కలిసిపోయి అనేక రోగాలను కలిగించుచున్నవి. వీటిని నివారించుటకు ఎంతగా ప్రయత్నించినను సాధ్యమగుటలేదు. దానికి అగ్నిహోత్ర మొక్కటే ఏకైక ఉత్తమ సాధనమని చెప్పవచ్చును. ఇది అణుపరిశోధన వలన కలిగిన దోషాలనుగూడ నివారించగలదు. ఈ మధ్య విదేశాలలో ఆమ్లవర్షాల భయ మెక్కువగుచున్నది. ఇది మనకు క్రొత్తగా కనబడవచ్చును. కాని, మనకుకూడా కొద్దికాలంలోనే ఈ భయం రానున్నది. 1958 సంవత్సరంలో నార్వే దేశస్థులు తమ సరస్సులలోని చేపలు మున్నగునవి అకారణంగా మరణించుటకు కారణాలు వెదకుచు 1960 సం. నాటికి కారణం కనిపెట్టగలిగిరి. వారు సరస్సులలోని నీటిని పరీక్షించగా కొద్దిగా ఆమ్ల లక్షణాలు కనబడినవి. వర్ష జలాన్ని పరిశోధించగా ఆమ్లతత్త్వం కనబడినది. వాటికి కారణం కెమికల్ ఫ్యాక్టరీలు, పవర్ జనరేటర్లు మొదలగునవి విడుదల చేసే వివిధ విషవాయువులేనని శాస్త్రజ్ఞులు గుర్తించిరి. గంధకం, పాదరసం మొదలైన ఎన్నో రసాయనాలు గాలిలో కలిసిపోవుచున్నవి. వాటి ఆక్సైడ్‌లు మేఘాలలోను, అవి వర్షించినపుడు జలాలలోను కలిసిపోయి ఆమ్లవర్షాలుగా కురియుచున్నవి. 1979 సంవత్సరంలో నార్వేదేశ శాస్త్రజ్ఞులు జరిపిన సర్వేలో స్కాట్‌లాండ్‌లోని

72 సరస్సులు, 40 సెలయేర్లు విషపూరితమైనాయని వెల్లడయ్యింది. 1983 సంవత్సరంలో బ్రిటన్‌లో జరిపిన సర్వేలో విద్యుత్ కేంద్రాలు, కర్మాగారాలు, కార్లు వదిలే విషవాయువులు గాలిద్వారా మైళ్ళదూరం పయనించి సల్ఫ్యూరిక్‌యాసిడ్, నైట్రికాసిడ్‌గా మారి భూమిమీద పడుతున్నాయని తేలింది.

1974 లో మనదేశంలో (బొంబాయిలో) కొద్దిగా ఇట్టి వర్షం కురిసినది. అదే సంవత్సరం స్కాటిష్ పట్టణంలో కురిసిన వర్షపు నీరు ఎక్కువ శాతం ఏసిడ్ లక్షణాలు కలిగియున్నది. జర్మనీ, అమెరికా, కెనడా, స్వీడన్ మొదలైన దేశాలలో తరచుగా ఇటువంటి వర్షాలు కురియుచున్నవి. వీటివలన వృక్షసంపద నశించిపోవు చున్నది. ఆ నీరు దూరంగా నుండు వ్యవసాయక్షేత్రాలలో ప్రవహించి వాటిని పాడుచేయుచున్నది. భూములు ఎడారులుగా మారుచున్నవి. అనేక కట్టడాలు ఈ ఆమ్లవర్షాలవలన తమ మెరుగులను గోల్పోవుచున్నవి. ఇట్టి దుష్టవాయువును సంస్కరించి ప్రాణులకు ఆరోగ్యాన్ని, బలాన్ని ఉత్సాహాన్ని ఇచ్చునది ఒక్క అగ్నిహోత్రమే.

యజ్ఞం ద్వారా వాతావరణం పరిశుభ్రం చేయు పద్ధతి ప్రాచీన భారతదేశంలోనేగాక విదేశాలలోకూడా కొంత పరివర్తిత రూపంలో కనబడుచున్నది. చాలా పురాతన కాలం నుండియు స్కాట్‌లాండ్ దేశంలో అగ్నిహోత్రం చేయుట ఉన్నట్లు ప్రొ. మాక్స్‌ముల్లర్ అను పండితుడు వ్రాసియున్నాడు. దక్షిణ అమెరికా మరియు ఐర్లండ్ దేశాలలో కలరా వ్యాధి పోగొట్టుటకు అగ్నిహోత్రం చేయు ఆచారం కలదు. కొన్నిచోట్ల కొబ్బరి కాల్చగా వచ్చు ధూమంతో తల ఆరబెట్టుకొనుట వలన పేలు చనిపోవునను నమ్మకం కలదు. పసిబిడ్డలకు స్నానానంతరం తల ఆరుటకు, క్రిమిదోష నివారణకు పొగ వేయుదురు. ఇవి అన్నియు అగ్నిహోత్రానికి మారు రూపాలే.

## విదేశాలలో అగ్నిహోత్ర ప్రచారం

నేడు విదేశాలలో ఈ అగ్నిహోత్ర ప్రభావాన్ని గుర్తించు చున్నారు. ముఖ్యంగా అమెరికా, చిలీ, పోలెండ్ మరియు పశ్చిమ జర్మనీలలో దీని గుర్తింపు ఎక్కువగా నున్నది. 1965 సంవత్సరంలో నూతన ఉద్యమం ప్రారంభింపబడిన

అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని తూర్పు పశ్చిమ తీరాలలో నిత్యం అగ్నిహోత్రం చేయువారి సంఖ్య పెరుగుచున్నది. ఆశ్చర్యకరమైన విషయమేమనగా మేరీలాండ్ అను రాష్ట్రంలో బాల్టిమోర్ ప్రాంతంలో 'అగ్నిహోత్ర ప్రెస్‌ఫార్మ్' ఒకటి 9.9.1978 తేదీన స్థాపించబడింది. ఈ ప్రాంతాన్ని వాషింగ్‌టన్‌లోని వైట్‌హౌస్ నుండి ఒక గంట మోటారు ప్రయాణం చేసి చేరుకోవచ్చును. అచట 6 1/2 సంవత్సరాల నుండి నిరంతరంగా (Around the Clock.) అగ్నిహోత్రం జరుగుచున్నది.

అమెరికాలో శ్రీమతి మేరియా బ్రూన్ అను ఒక నృత్య కళాకారిణి వివిధ రోగాలను నివారించు విషయంలో పరిశోధనలు చేయుచున్నది. నృత్యంతోబాటు అగ్నిహోత్రం గురించి కూడా పరిశోధించుచున్నది. తన దగ్గర నృత్యం నేర్చుకొనుటకు వచ్చిన వారిని ముందుగా ఒక హాలులో కూర్చుండబెట్టి యజ్ఞం చేసి, ఆ తరువాతనే పాఠాలు చెప్పును. ఈమె మోర్గన్ స్టేట్ యూనివర్సిటీలో చదువుకున్న గొప్ప విద్యావంతురాలు, బాల్టీమోర్ నివాసిని. దూరదర్శిని తారగా అమెరికాలో గొప్పగా ఆరాధించబడుతున్న వ్యక్తి. ప్రస్తుతం వాటికన్నిటికి స్వస్తి చెప్పి తన సమయాన్నంతా నృత్యం మరియు హోమ ప్రచారంలో గడుపుతున్నది. వాటి ప్రయోజనాలను పాటల ద్వారా, నృత్యాల ద్వారా, అగ్నిహోత్ర భస్మంతో చేసిన ఔషధాల ద్వారా, సాహిత్యం ద్వారా ప్రచారం చేస్తూ అమెరికా సంయుక్త రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో పర్యటించుచున్నది. వీటితోబాటు ఆహార విహార వస్త్రధారణలలో ప్రకృతి సహజ పద్ధతులను ప్రచారం చేయుచున్నది.

సౌత్‌వెస్ట్‌కు మూలగా ఒకటిన్నర గంటల ప్రయాణంలో చేరుకోగల వర్జీనియా రాష్ట్రంలోని మేడిసన్ ప్రాంతంలో మొదటి అగ్నిహోత్ర దేవాలయం నిర్మింపబడింది. ఇది 1973 సెప్టెంబర్ 22వ తేదీన స్థాపించబడింది. అప్పటినుండి ఇటువంటి అగ్నిహోత్ర దేవాలయాలు అమెరికా అంతటా వ్యాపించినవి. అగ్నిహోత్ర దేవాలయ మనగా ఒక విశాలమైన గది యుండును. ఆ గదిలో ఉదయ సాయం కాలములందు నియమిత వేళలలో అగ్నిహోత్రం చేయుదురు. మిగతా సమయాలలో నిశ్శబ్ద వాతావరణ ముండును. ఒక

విగ్రహంగాని, పురోహితుడుగాని ఎవ్వరు ఉండరు. అగ్నిహోత్రాన్ని ఇటువంటి దేవాలయాలలోనే గాక ఆరుబయట కూడా చేయవచ్చును. కొన్ని చికిత్సా పరిశోధనలకు అగ్నిహోత్రం గదులలో చేయుట అవసరం.

చిలీ దేశంలో ఏండస్ పర్వతాలపై ఒక ప్రత్యేక అగ్ని హోత్ర దేవాలయం నిర్మించిరి. అచట చికిత్స పొందుటకు వేలమంది రోగులు వత్తురు. రోగాలతో బాధపడు కుక్కలు మొదలైన జంతువులను కూడా అక్కడకు తీసుకుని వత్తురు. రోగ నివారణానంతరం మాత్రమే వారు ఇండ్లకు వెళ్ళుదురు. విచిత్రమేమనగా ఈ మధ్య అచ్చట వచ్చిన మంచు తుఫానులో ఆ పర్వత ప్రాంతం వారికి ఎట్టి హానియు కలుగలేదు.

పోలెండ్ దేశంలో విద్యావంతులే దీని నెక్కువ ప్రచారం చేయుచున్నారు. ఒక సైంటిస్ట్‌ల బృందం దేశంలో 17 ప్రాంతాలలో ఈ అగ్నిహోత్ర దేవాలయాలను నిర్మించి ప్రచారం చేయుచున్నారు. ఒక దేవాలయాన్ని ప్రారంభించుటకు ముందు ఆ ప్రాంతంలో ప్రచారం చేయుదురు. ఎవరైతే వెంటనే అగ్నిహోత్రం చేయుటకు దీక్ష వహింతురో అటువంటివారు మాత్రమే రేపటి మా సభకు రావలసిందని ప్రకటింతురు. ఒకచోట ఆశ్చర్యకరంగా 200 మందికి పైగా సైంటిస్టులు ఆ సభకు హాజరై మరునాటి నుండి అగ్నిహోత్రం ప్రారంభించారు.

అగ్నిహోత్ర ప్రచారం ఎక్కువగా జరుగుచున్న దేశాలలో పశ్చిమ జర్మనీ రెండవది. ఇచ్చట ముఖ్యంగా అగ్నిహోత్రానంతరం మిగిలిన భస్మాన్ని ఔషధాలుగా మార్చి వాటితో ప్రయోగాలు చేయుచున్నారు. ఆ భస్మంతో మాత్రలు, గొట్టాలు, అరకులు, పై పూత మందులు, కండ్లలో వేసుకొను చుక్కల మందులు మొదలగునవి తయారు చేయుచున్నారు. ఇంకను పరిశోధనలు జరుగుచునే యున్నవి. వాతావరణ కాలుష్యం వలన నశించిపోవుచున్న అటవీ ప్రాంతంలో 1984 సం. వసంత ఋతువులో పరిశోధనా దృష్టితో పెద్ద అగ్నిహోత్రాలు నిర్వహించిరి. 1985 సం. మధ్యనాటికి అద్భుత ఫలితాలు కనబడినవి. చెట్లు కొత్తగా చిగురించినవి. వారు ఇందుకు సంబంధించిన కొంత సాహిత్యాన్ని కూడా ప్రచురించిరి.

# మనదేశంలో అగ్నిహోత్ర పరిశోధన

మనదేశంలో మహారాష్ట్రలోని షోలాపూర్ జిల్లాలోని శివపురిలో **'అంతర్జాతీయ హోమ చికిత్సా పరిశోధనా సంస్థ'** యొకటి కలదు. ఇది భారతదేశంలో ప్రధానకేంద్రం. ఇది అకల్‌కోట రైల్‌స్టేషన్‌నుండి 15 ని. ప్రయాణ దూరంలో నున్నది. అచట మఠాధిపతియైన శ్రీ గజానన మహారాజ్‌గారి ఆధ్వర్యంలో బ్రహ్మాండమైన సోమయజ్ఞం నిర్వహింపబడినది. దానితో చాలామంది ప్రభావితులై అగ్నిహోత్ర ప్రచారం చేయుటకు దీక్ష వహించిరి. వారి శిష్యులే విదేశాలలో అగ్నిహోత్ర ప్రచారం చేయుచున్నారు. అట్టివారిలో శ్రీ వసంత వి.పరాంజపేగారు ముఖ్యులు. వీరు నేటికిని ఎన్నో పరిశోధనలు నిర్వహించుచున్నారు. వీరు 'సత్సంగ్' అను పత్రికకు సంపాదకులు. ఈ పత్రిక అమెరికాలోని రాండాల్స్‌టౌన్ (వాషింగ్‌టన్) పట్టణం నుండి వెలువడుచున్నది. ఈ పత్రికలోని వ్యాసాలన్నీ అగ్నిహోత్ర పరిశోధనా ఫలితాలనే వివరించును.

పూనా యూనివర్సిటీలో డాక్టర్ బేరీరత్నార్ అను అమెరికన్ మానసిక తత్త్వవేత్త అగ్నిహోత్రంపై పరిశోధన చేయుచున్నారు. వారు "అగ్నిహోత్రం వలన ప్రకృతిలో, వాతావరణంలో నొక గొప్పమార్పు జరుగును. ఇది మానవమేధస్సుపై కూడా ఆరోగ్యకరమైన గొప్పమార్పు కలిగించుచున్నది. ఆయుర్వేద గ్రంథాలలో ఇటువంటి చికిత్సా పద్ధతులెన్నియో చెప్పబడియున్న" వని చెప్పుచున్నారు. వీరు డాక్టర్ శ్రీ అరవింద్ డి. మోడ్కర్‌గారితో కలిసి కొన్ని ప్రయోగాలు చేసిరి. అగ్నిహోత్రం నిర్వహించిన గదిలో అగ్నిహోత్రానికి ముందు కొన్ని రోగకారక సూక్ష్మ జీవులను ఉంచి అగ్నిహోత్రానంతరం వాటిని పరిశీలించగా ఆ సూక్ష్మజీవులు చాలావరకు 91.4% నశించినట్లు కనుగొనిరి. మరొక ప్రయోగంలో అగ్నిహోత్రం దగ్గర కూర్చొన్నవారి రక్తంలోని చక్కెర శాతం పరిశీలించగా అగ్నిహోత్రం ముందుకన్న తరువాత ఆ శాతం తగ్గినట్లు కనుగొనిరి.

## పంటలపై అగ్నిహోత్ర ప్రభావం

మహారాష్ట్ర గ్రేప్ గ్రోయర్స్ అసోసియేషన్‌లో పరిశోధనా శాస్త్రవేత్తగా పనిచేయుచున్న డా. భుజబల్‌గారు నాసిక్‌లోని పింపల్ మరియు బస్వంత్ గ్రామంలోగల ద్రాక్షతోటలలో అగ్నిహోత్రం నిర్వహించి ప్రయోగాలు చేసిరి. వారి ప్రయోగాలలో ఆరు నెలలలో మొలకెత్త వలసిన విత్తనాలు కేవలం 21 దినములలోనే మొలకెత్తి ఆశ్చర్యమును కలిగించినవి. విదేశాలలో కూడా (అమెరికా, పోలండ్, చీలీ, పశ్చిమ జర్మనీలలో) ఈ ప్రయోగాలు జరిగినవి. చీలీ దేశంలో సెండగో పట్టణం వెలుపలగల ఒక చిన్న వ్యవసాయ క్షేత్రంలో శ్రీ యర్విన్‌జా చార్వస్‌గారు అగ్నిహోత్రాన్ని నియమపూర్వకంగా నిర్వహించగా అపురూపమైన బంగాళా దుంపలు, టమాటా, చిక్కుడు మొదలగునవి పెద్ద ఆకారంలో పండినవి. బంగాళాదుంపలకుపట్టు బూజును అగ్నిహోత్ర భస్మం పూర్తిగా అరికట్టినది. అమెరికా శాన్‌ఫ్రాన్సిస్‌కోలో శ్రీమతి లారాపారలిన్ నిర్వహించిన పరిశోధనలలో మందు మొక్కల ఔషధ ప్రభావం గొప్పగా పెరిగినది. పంటలు ఎక్కువ దిగుబడి నిచ్చినవి. చెట్లకుపట్టు బూజు, ఫంగస్ మొదలగు తెగుళ్ళన్నీ అగ్నిహోత్ర వాయువువలన నశించినవి. పోలెండ్ దేశంలో అగ్నిహోత్రం తీవ్ర ఆహార కొరతను పరిష్కరించుచున్నది. ఇట్టివే పశ్చిమ జర్మనీలోనూ చాలా అద్భుతాలు జరిగినవి.

## యజ్ఞము - కామధేనువు

'సహ యజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వ మేషవోఽస్త్విష్ట కామధుక్' ॥ (భగవద్గీత 3-10)

సృష్టి ఆరంభమున పరమేశ్వరుడు మానవులతోబాటు యజ్ఞమును సృష్టించి మానవుల కీవిధంగా నుపదేశించెను. 'ఓ మానవులారా! యజ్ఞం ద్వారా మీ మీ కోరికలను నెరవేర్చుకొనుడు. ఇది మీకు కోరికలను దీర్చు కామధేనువు వంటిది.'

ఇవి భగవద్గీతలోని శ్రీకృష్ణుని వచనములు. అగ్నిహోత్రం ఆరోగ్యాన్ని పెంపొందింప జేయుటకు, వాతావరణ కాలుష్యాన్ని దూరం చేయుటకు, పంటల

దిగుబడికేగాక మరెన్నో ప్రయోజనాలు నెరవేర్చగల కామధేనువు.

**'ఇష్టాన్ భోగన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞ భావితాః'**

యజ్ఞం వలన సంస్కరింపబడిన భూమ్యాది దేవతలు మానవులు కోరిన కోరికలను నెరవేర్చును (గీత. 3-12). ఇవియును శ్రీకృష్ణుని వచనములే. యజుర్వేదంలో ఇట్టివే మరికొన్ని ప్రేరణలున్నవి. వీటి ఆధారంతో ప్రాచీన కాలంలో భారతీయ ఋషులు కొన్ని ప్రయోగాలు చేసి అద్భుతఫలితాల నొందిరి. అటువంటివే పుత్రకామేష్ఠి మొదలగు యజ్ఞాలు. నేటికీ అటువంటి ఫలితాలు కలుగుచునే ఉన్నవి. ఇండోర్ వాస్తవ్యులు కీ.శే. పండిత వీరసేన వేదశ్రమీగారు ఇట్టి యజ్ఞాలను నిర్వహించి కొందరికి సంతానప్రాప్తి కలిగించిరి. అన్ని వైద్యాలలోను ప్రయత్నించి విసుగుచెందినవారే ఈ పుత్రకామేష్టి యజ్ఞాన్ని చేయించుకొనుటకు ముందుకు వచ్చిరి. ఇది వ్యయంతో కూడిన, శ్రమతో కూడిన ప్రయోగమైనప్పటికీ ఫలితాలు మాత్రం అత్యద్భుతం.

గర్భవతులైన స్త్రీలు తమకు మగపిల్లలే కావలెనన్న కొన్ని విశేష ద్రవ్యాలతో పుంసవన సంస్కారం (యజ్ఞం) చేసికొనిన పుత్రుడు కలుగును. ఆడపిల్లలే కావలెనన్న మరియొక రకమైన మూలికలతో ఈ యజ్ఞం నిర్వహించవలసి యుండును. ఈ మధ్య జరిగిన వైజ్ఞానిక పరిశోధనలలో వారు తీసుకునే ఆహారంపై స్త్రీ పురుష సంతానం కలుగు అవకాశ మున్నదని వినుచున్నాము. క్రోమోజోమ్స్‌లో మార్పులు తీసుకురాగలిగినచో ఇది సాధ్యమే యగును. కొన్ని మూలికలు అటువంటి మార్పులు తీసుకురాగల శక్తివంతములు. వాటితో హోమం చేసిన వాటి ప్రభావం గొప్పగా అభివృద్ధి చెందును. దానివలన ఫలితాలు కలుగవచ్చును. దీనిని పరిశోధించవలసి యున్నది.

చాలా సంవత్సరాలు వర్షాలు లేక వృక్షజాతియంతా నశించిపోయి ఎడారులుగా మారిపోనున్న ఊసర క్షేత్రాలను యజ్ఞాల ద్వారా వర్షపాతం ఎక్కువ చేసి ఉర్వర క్షేత్రాలుగా మార్చవచ్చును. అగ్నిహోత్రాల ద్వారా భూమి పొరలలో కూడ మార్పులు తీసుకురావచ్చును. దీనిని గోమేధయజ్ఞ మందురు. 'గౌరితి పృథివీ నామసు పఠితమ్, గౌరితి పృథివ్యాః నామధేయమ్' అని

నిఘంటు, నిరుక్తాల నిర్వచనం. గౌః అనగా పృథివి – భూమి.

దేశంలోని లోటుపాట్లను సరిచేయుటకు నిర్వహించు యజ్ఞాలను అశ్వమేధయజ్ఞాలందురు. **'రాష్ట్రం వా అశ్వమేధః'** (శత. బ్రా. 13.2.6.3) **'అగ్నిర్ వా అశ్వః'**, (శత. బ్రా. 3.6.2.5), **'అజ్యం మేధః, మేధో వా ఆజ్యం'** (శత. బ్రా. 13.3.6.2) అని శతపథ బ్రాహ్మణం నిర్వచించును. రాష్ట్రానికి అశ్వమనియు, నేతికి మేధయనియు పర్యాయ పదములు. రాష్ట్రక్షేమం కొరకు నేతితో ఆహుతుల నిచ్చుట; భాగ్యవంతులనుండి కానుకలు స్వీకరించి పేదవారికి, సత్‌పురుషులకు, విద్వాంసులకు, కళాకారులకు పంచియిచ్చుటయే అశ్వమేధయజ్ఞమగును. మధ్యకాలంలో ఈ సత్ప్రథ లోపించింది. ఉవ్వట మహీధరుల భాష్యాల ననుసరించి ఒక వికృత అశ్వమేధయజ్ఞం నేడు ప్రచారంలో నున్నది. మహీధరుడు యజుర్వేదంలోని (23.30) మంత్రానికి అశ్వమేధయజ్ఞ పరంగా భాష్యం వ్రాయుచు యజ్ఞవేదిక సమీపమున కట్టబడిన యజ్ఞాశ్వము యొక్క.....యజమానుని భార్య స్వయంగా చేతితో తీసుకుని తన..........యందు ప్రవేశపెట్టుకొనవలెనని వ్రాసి యున్నాడు. మంత్రంలో అట్టి అర్థమే కానరాదు. ఈ మంత్రానికి మహర్షి దయానందుడు వ్రాసిన వ్యాకరణయుక్త హేతుబద్ధ వ్యాఖ్యానం చదివిన ఈ విషయం స్పష్టమగును.

ఈ విధంగానే పశువుల అభివృద్ధికి, ఆయుర్దాయాన్ని పెంచుకొనుటకు, ఇంద్రియ శక్తుల నభివృద్ధి చేసికొనుటకు, బుద్ధివికాసానికి ఎన్నెన్నో రకాల యజ్ఞాల వర్ణన ప్రాచీన శాస్త్రాలలో గలదు. ఆ యజ్ఞాలలో ఆయా భావాల ప్రేరేపించు వేదమంత్రాలతో ఆహుతులిప్పించి, విద్వాంసులు వాటిని వివరించి చెప్పి, తదనుగుణంగా ఆహార విహారాలను జరుపుకొనుటకు ప్రబోధించెడివారు. ఆయా యజ్ఞాలలో ప్రత్యేక మూలికలను ఆహుతులుగా నిచ్చెడివారు. ఆ ఔషధాల ప్రభావం వలన, వారి ఆహార విహారాలలోని మార్పుల వలన వారి దీర్ఘ జీవనాది కోరికలు నెరవేరెడివి.

# అగ్ని హోత్ర పునరుద్ధారకుడు మహర్షి దయానందుడు

సృష్ట్యాదినుండి మహాభారత కాలం వరకు యజ్ఞయాగాదుల ప్రచారం విశ్వవ్యాప్తంగా నుండినట్లు ప్రాచీన చరిత్రలవలన తెలియుచున్నది. మహాభారత యుద్ధానంతరం యజ్ఞయాగాదుల ప్రచారం వికృతమగుచు వచ్చినది. అది క్రమంగా వృద్ధియగుచు బుద్ధుని కాలంనాటికి యజ్ఞాలు పెద్దపెద్ద కబేలాలు (Slaughter houses) గా మారిపోయినవి. యజ్ఞాలయందు సుగంధితాలు, రోగనాశకాలు నగు ఓషధులకు మారుగా పశుపక్ష్యాదుల మాంసాన్ని ఆహుతులుగా నిచ్చు ఆచారం ప్రచారంలో నుండెను. అహింసామూర్తియైన బుద్ధుడు **'ఇదేమి ధర్మ'** మని నిగ్గదీసి ప్రశ్నించగా యాజ్ఞికహింస వేద ప్రతిపాదితమని పౌరాణిక పురోహితులు సమాధానమిచ్చిరి. **'వైదిక హింసా, హింసా న భవతి'** అను కపోల కల్పిత ధర్మసూత్రాలను చూపించసాగిరి. ఇది విని బుద్ధుడు అత్యంత ఖిన్నుడై 'ఇదియే నిజమగుచో నేనట్టి వేదాలను నిరసింతును. వేదం ఈశ్వరవాణి యని చెప్పుదురు కదా! ఇంత హింసను ప్రేరేపించునట్టి ఈశ్వరుని గౌరవించుటకు నేను సిద్ధంగా లే' నని చెప్పెను. **'అహింసయే పరమ ధర్మ'** మనే ప్రచారం గావించెను.

వామమార్గ పౌరాణిక పండితులు బుద్ధుని వేద విరోధిగాను, నాస్తికునిగను ప్రచారం చేసిరి. తాము యజ్ఞయాగాదులపేర చంపెడి పశువులు స్వర్గమును చేరుననియు, ఆ విధంగా యజ్ఞం చేయు వ్యక్తికి స్వర్గం ప్రాప్తించుననియు కొన్ని కల్పిత అర్థాలను ప్రచారం చేసిరి. **'ఇజానాః స్వర్గం యాన్తి'** మరియు **'స్వర్గకామో యజేత'** మొదలైన వాక్యాలలోని స్వర్గ పదానికి ఒక సుఖమయ విశేషలోకమును కల్పించిరి. మహర్షి దయానందుడు స్వర్గమొక ప్రత్యేక లోకం కాదనియు, స్వాస్థ్య సుఖమయ జీవనమే స్వర్గమనియు నిరూపించెను. హింసారహిత అగ్నిహోత్రాదులవలన, పరోపకారమయ శుభకర్మల వలన ఆ స్వర్గమును ఇచటనే - ఈ జన్మమునందే బొందవచ్చునని ప్రచారం చేసెను. సాయణాది ఆచార్యులు వేదాలకు భాష్యాలు వ్రాయుచు వేదమంత్రాలన్నియు యజ్ఞయాగాది క్రతువులలో వివిధ క్రియలను నిర్వహించుటకేనని వ్రాసిరి. ఏయే మంత్రాలతో ఏయే విధాలుగా పశువులను

చంపి ఆహుతు లివ్వవలెనో క్రూరాతి క్రూరంగా వ్యాఖ్యానించిరి.

మహర్షి దయానందుని కాలంనాటికి ఈ కల్పిత కథలే ధర్మం పేర ప్రచారంలో నుండెను. మహర్షి దయానందుడు బుద్ధునివలె యజ్ఞయాగాదుల నిరసించక వాటిని సంస్కరించ యత్నించెను. దయానందునకు పూర్వం యజ్ఞం యొక్క వైజ్ఞానిక స్వరూపం సర్వదా లోపించి యుండెను. మహాయోగియైన దయానందుడు సమాధినిష్ఠుడై ఈశ్వరునిద్వారా వేదమంత్రాల అర్థాన్ని గ్రహించి తన అగాధ వ్యాకరణ పాండిత్యంతో వేదమంత్రాలకు వైజ్ఞానిక వ్యాఖ్యానం గావించెను. ముఖ్యంగా అగ్నిహోత్ర విషయంలో ఇదియొక వైజ్ఞానిక ప్రక్రియ యని మొదటగా చాటి చెప్పినవాడు మహర్షి దయానందుడే. వారి వేద భాష్యం, సత్యార్థ ప్రకాశం, సంస్కారవిధి మొదలైన గ్రంథాలలో, వారి ప్రవచనాలలో అగ్నిహోత్రం వలన కలిగే వైజ్ఞానిక ఫలితాల నెన్నిటినో వివరించిరి. వాటిని నేడు ఆధునిక వైజ్ఞానికులందరు అంగీకరించుచున్నారు. వారు రచించిన **'సంస్కారవిధి'** అను గ్రంథంలో యజ్ఞకుండ పరిమాణం-ఆకారం యజ్ఞశాలరూపం చాలా వైజ్ఞానికంగా వివరించిరి. అందు సమిధలు, హోమద్రవ్యాలు, స్థాలీపాకాలు, యజ్ఞపాత్రలు యెటువంటివి యుండవలెనో వివరించారు.

మహర్షి రూపొందించిన అగ్నిహోత్ర విధానం పూర్తిగా వైజ్ఞానికమైనది. **'అగ్నయే స్వాహా' 'సోమాయ స్వాహా'** మంత్రాలతో ఉత్తర దక్షిణ దిశలందు ఆహుతులిచ్చు విధాన మేర్పరచెను. ఉత్తర దక్షిణ ధ్రువాలు ధన, ఋణ విద్యుదయస్కాంత శక్తులను కలిగి యుండును. అందుకు తగినట్లుగా ఈ ఆహుతులున్నవని వైజ్ఞానికు లంగీకరింతురు. **'ప్రజాపతయే స్వాహా' 'ఇంద్రాయ స్వాహా'** ఈ మంత్రాలతో హవనకుండ మధ్యమున ఆహుతులివ్వవలసిందిగా విధాన మేర్పర్చెను. ప్రజాపతి అనగా కార్బను, ఇంద్రుడనగా నైట్రోజన్ అని గ్రహించవలసిందిగా వైజ్ఞానికులు చెప్పుచున్నారు. యజ్ఞకుండం చుట్టూ నాలుగువైపులా నీరు పోయవలసిన విధాన మేర్పర్చెను. ఇది కూడా వైజ్ఞానికంగా ఉన్నది. నీటి ఆవిరితో కలిసియున్నప్పుడే యజ్ఞవాయువులు ఎక్కువ మేలు చేయును. **'స్విష్టకృతి'** ఆహుతిలో మధుర పదార్థంగాని, మోహనభోగుగాని

ఆహుతిగా ఇవ్వవలసినదిగా చెప్పెను. ఈ మధుర పదార్థాలు యజ్ఞవాయువుల తీక్షణతలను సమరస పరచును. ఆ మంత్రార్థం కూడా అటులే యున్నది.

వ్యాహృదాహుతులలో భూలోకాన ఆహుతులు అగ్ని రూపాన నందుననియు, భువర్ లోకాన (అంతరిక్ష వాతావరణంలో) వాయు రూపాన నుందుననియు, స్వర్‌లోకాన (సూర్యలోకాన) ఆదిత్యరూపాన్ని జెందుననియు చెప్పబడెను. ఇదియును వైజ్ఞానికంగా నున్నది. మనం వేసిన ఆహుతులు యజ్ఞకుండంలో (భూమిపై) అగ్ని ఆకారం పొందును. అంతరిక్షంలో వాయురూపం పొందును. సూక్ష్మాంశం సూర్యుని చేరి సూర్యరూపం పొందును. ఉదయకాల హోమంలో విధించిన మంత్రాలు వేద ప్రతిపాదిత వైజ్ఞానికార్థమును తెలుపును. ఈ ఆహుతులలోని సూక్ష్మాంశం సూర్యలోకాన్ని చేరి సూర్యునకు కాంతిని, వర్చస్సును ఇచ్చి తద్వారా అనుకూల వాతావరణానికి తోడ్పడును. ఈ విషయమునే సామవేదం **'సూర్యస్య భానుః యజ్ఞోదాధార'** (సామ. 18.43) సూర్యప్రకాశం యజ్ఞం (అగ్నిహోత్రం) పై ఆధారపడి యుండు' నని చెప్పును.

**'ప్రాతః ప్రాతః గృహపతిర్ నో అగ్నిః సాయం సాయం సౌమనస్య దాతా, వసోర్ వసోర్ వసుధాన ఏధీంధానాస్త్వా శతంహిమా ఋధేమ'** (అథర్వవేదం. 19.55.4)

ఉదయకాలమున నిచ్చు ఆహుతులు సాయంకాలం వరకు వాతావరణ దోషాలను సంస్కరించుచు ప్రాణులకు మేలు చేయును. **'సాయం సాయం గృహపతిర్ నో అగ్నిః ప్రాతః ప్రాతః సౌమనస్య దాతా వసోర్ వసోర్ వసుధాన ఏధీ వయం త్వేంధానాస్తన్వం పుషేమ'** (అథర్వ. 19.55.3)

సాయంకాలాన నిచ్చు ఆహుతుల వలన భూమిపై నున్న అగ్నితత్త్వం బలపడి ప్రాణులకు మేలు చేయును. రాత్రియంతయు మరల సూర్యోదయ మగువరకు వాతావరణ దోషాలను సంస్కరించుచుండును.

భూర్ భువర్ స్వర్ లోకాలలోనుండు హవ్య పదార్థాలు మన శరీరంలోని ప్రాణ, అపాన, వ్యాన వాయువులను పోలిన క్రియలను సృష్టిలో (వాతావరణంలో) చేయుచుండును. ఇట్టివే ఎన్నో వైజ్ఞానిక విషయాలు వారి రచనలలో గనబడును.

వారు రచించిన **'సంస్కారవిధి'** అను గ్రంథంలో ఏయే శుభకార్యాలందు ఏయే రకాల హోమాలు జేయవలెనో, ఏయే పదార్థాలను ఆహుతులుగా నివ్వవలెనో వైజ్ఞానికంగా వివరించి యున్నారు. యజుర్వేదంలోని యజ్ఞసంబంధ మంత్రాలన్నిటికి వైజ్ఞానిక వ్యాఖ్యానాలు జేసియున్నారు. అభిరుచి గలవారు వారి యజుర్వేద భాష్యాన్ని జదివి వివరంగా తెలుసుకొనవచ్చును.

అగ్నిహోత్రాన్ని గురించి ఎంత చదివినను, విన్నను ఆచరించనిదే దానివల్ల లాభం కలుగదు. ఇంతేగాక, పరిశోధనలు చేసి క్రొత్త క్రొత్త చికిత్సా పద్ధతులను కనిపెట్టవలసి యున్నది.

ఇక కొన్ని చికిత్సా ప్రక్రియలను తెలిసికొందము రండు.

## అగ్నిహోత్ర మందులను తయారుచేయు విధానము

అగ్నిహోత్ర మందులను తయారుచేయుటకు పూర్వం ఒక క్రమపద్ధతిలో అగ్నిహోత్రం చేయుట అవసరం. మహర్షి దయానందుడు రచించిన 'పంచమహాయజ్ఞవిధి' అను గ్రంథంలో దేవ యజ్ఞమైన అగ్నిహోత్రాన్ని గురించి వివరంగా ఉన్నది. ఆ పుస్తకాలు అన్ని ఆర్యసమాజ మందిరాలలోను లభించును. అందు నిర్దేశించిన ప్రకారం అగ్నిహోత్రం చేసి కుండంలో మిగిలిన భస్మమును సేకరించుకొనవలెను. అగ్నిహోత్ర భస్మంలో ఒకేవిధమైన (యూనిఫారమ్) శక్తి కలిగియుండునటుల చూచుటకు ఇది అవసరం. మందులను ఈ భస్మంతోనే తయారు చేయవలెను. అగ్నిహోత్ర భస్మానికి **'ఫార్మాస్యూటికల్'** పేరు **'అగ్నిహోత్ర ఉష్ట'**. లాటిన్ భాషలో 'ఉష్ట' అనగా 'మూస' అని యర్థము. ముందుగా ఈ భస్మాన్ని మెత్తటి జల్లెడతో జల్లించవలెను. తదుపరి పలుచని వస్త్రంతో వస్త్రగాలితం చేయవలెను. పరిణామంగా శ్రేష్ఠమైన భస్మం నిర్మాణమగును. ఈ భస్మాన్ని లోపలకు, బయటకు (Internal and External) ఉపయోగించ వచ్చును.

కేవలం అగ్నిహోత్ర మందులను మాత్రం ఉపయోగించిన ఎక్కువ ప్రయోజనముండదు. ఈ మందులలోకన్న అగ్నిహోత్రం నుండి వెలువడు వాయువులలోనే అత్యధికమైన రోగనివారణ శక్తియుండును. గాన ఉదయ సాయంకాలములందు అగ్నిహోత్రం చేయుచు మందులను సేవించుట మంచిది

వీలు పడనివారు మందులు సేవించవచ్చును.

1. అగ్నిహోత్ర మాత్రలు (Tablets)

అగ్నిహోత్ర భస్మాన్ని కొద్ది తేనెతోగాని, ఆవునేతితోగాని గట్టి ముద్దయగునట్లు కలిపి కుంకుడుగింజ పరిమాణంగా మాత్రలు చేసుకొని అరబెట్టి సీసాలో భద్రపరచుకొనవలయును. వీటిని ఒక మాత్ర చొప్పున రోజుకు రెండు లేదా మూడుసార్లు నీటితోగాని, పాలతోగాని సేవించవలెను.

2. అగ్నిహోత్ర గొట్టములు (Capsules) :

బజారులో మందులకొరకు ఉపయోగించు ఖాళీ గొట్టములు లభించును. వాటిలో అగ్ని హోత్ర భస్మమును నింపి అ ల్లోపతి గొట్టములు సేవించునట్లు రోజుకు రెండు లేదా మూడుసార్లు తడవకు ఒక గొట్టము చొప్పున నీటితోగాని, పాలతోగాని సేవించవచ్చును.

3. అగ్నిహోత్ర మలాము (Ointment)

శుభ్రమైన గాజుపాత్రలో 90గ్రా. నేతిని, 10 గ్రాముల అగ్నిహోత్ర భస్మమును (9:1) వేసి బాగుగా కలుపవలెను. అప్పుడది మలాముగా తయారగును. ఇది కాల్పులకు, చర్మవ్యాధులకు, నొప్పులకు పైకి మర్దించుటకు ఉపయుక్తముగా నుండును. నేతికి మన శరీరంలో ఇంకిపోయే గుణము కలదు. అందుచే మందులను కూడా తనతో బాధగానున్న ప్రాంతమునకు తీసుకువెళ్ళును. దానివల్ల బాధ వెంటనే ఉపశమనం చెందును.

4. అగ్నిహోత్ర నవనీతము (Cream)

ఒక వంతు నేతిలో మూడువంతులు పరిశుభ్రమైన నీటిని (1:3) కలిపి చిలకరించి కొద్దిసేపు ఉంచిన నీటి భాగము పైకి తేలును. ఆ నీటిని పారబోసి తిరిగి మూడువంతుల క్రొత్త నీటినిపోసి చిలుకరించవలెను. ఇట్లు 15 సార్లు చేయవలెను. అట్లు తయారైన నేతితో (నవనీతముతో) 90 గ్రాముల నేతికి 10 గ్రాముల అగ్నిహోత్ర భస్మమును (9:1) వేసి బాగుగా కలుపవలెను. అప్పుడది అగ్నిహోత్రనవనీత మగును. దీనిని బయటకు, లోపలకు

ఉపయోగించవచ్చును.

5. అగ్నిహోత్ర కంటిచుక్కలు (Eye Drops)

ఒకవంతు అగ్నిహోత్ర భస్మమును తొమ్మిది వంతుల డిస్టిల్‌వాటర్ 1:9లో ఒక శుభ్రమైన పాత్రలో కలిపి కొద్దిగ వేడిచేయవలెను. వేడి అయిన ఆ పదార్థమును మరుగుచున్న నీరుగల వేరొక పాత్రలో అరగంట పెట్టవలెను. అప్పుడప్పుడు ఆ పదార్థమును బాగుగ కలుపుచుండవలెను. తదుపరి ఫిల్టర్ పేపర్‌తో వడగట్టవలెను. అప్పుడది కంటిలో వేసుకొనుటకు ఉపయోగపడును. ఈ చుక్కలను అన్ని రకముల కంటి జబ్బులకు వాడవచ్చును. ఉదయ సాయంకాలముల యందు లేదా అవసరమునుబట్టి ఎక్కువసార్లు ఈ కంటిచుక్కలమందు Eye Drops వాడవచ్చును. రోగియొక్క కంటి క్రిందిరెప్పను తెరచి రెండు చుక్కలువేసి ఆ చుక్కలు యింకునట్లు మృదువుగా రెప్పలపై మర్దన చేయవలెను.

6. అగ్నిహోత్ర సపోజిటరీస్ (Suppositories)

85 భాగముల నేతిలో 15 భాగముల అగ్నిహోత్ర భస్మమును (85:15) వేసి వేడిచేసి బాగుగ కలుపవలెను. అట్టి పదార్థమును Refrigerator లో నుంచి గట్టిపరచుకొనవలెను. దీనిని మూలశంకకు, స్త్రీ పురుషుల జననేంద్రియ జబ్బులకు, లోపలకు ఎక్కించుటకు ఉపయోగపడును.

7. అగ్నిహోత్ర ఆవిరి (Steam bath)

మరుగుచున్న నీరుగల ఒక పాత్రలో ఒక చెంచా అగ్ని హోత్ర భస్మమునువేసి దానిపై ముఖము నుంచి ఆవిరిని పీల్చవలెను. అట్లు పీల్చునపుడు తలను, పాత్రను ఒక దుప్పటితో కప్పిఉంచుట మంచిది. ఇది జలుబు, దగ్గు మొదలగు నాశికా శ్వాసకోశ వ్యాధుల చికిత్సకు ఉపయోగపడును.

## అగ్నిహోత్రభస్మ ప్రయోగ ఫలితాలు

పశ్చిమ జర్మనీలోని కోలిస్‌స్ట్రాసిలోను, మహారాష్ట్రలోని శివపురిలోను అగ్నిహోత్ర భస్మంతో రోగులకు చికిత్స జరిపి వారు పొందిన ప్రయోగ ఫలితాలను ఈ విధంగా వివరించిరి. అగ్నిహోత్రభస్మ ప్రయోగంతోబాటు రోగులను ఉదయ

సాయంకాలములయందు అగ్నిహోత్ర వాతావరణంలో కొద్దిసేపు ఉంచినట్లు వారు తెలుపుచున్నారు.

1. నొసటి బాధ (Frontal Sinusitis)

మూడు నాలుగు రోజులు అగ్నిహోత్రభస్మం లోనికి యిచ్చుచు అగ్నిహోత్ర సమీపమున కూర్చుండ బెట్టుట వలన ముక్కునుండి చీము వెడలిపోయి తలనొప్పి తగ్గినది.

2. చర్మంపై మచ్చలు (Skin Fungus)

అగ్నిహోత్ర భస్మాన్ని ప్రతిరోజు అనేకసార్లు మచ్చలపైన రుద్దగా కొద్ది రోజులలో పూర్తిగ పోయినవి.

3. మానని పుండు (Non-Healing Wound)

అగ్నిహోత్రభస్మాన్ని గాయంపై మూడు రోజులు రుద్దగా పూర్తిగా మానిపోయెను.

4. చిన్న పిల్లల చర్మవ్యాధులు (Dermatitis of Babies)

అగ్నిహోత్రభస్మాన్ని రోజుకు నాలుగుసార్లు రుద్దగా రెండు రోజుల్లో పూర్తిగా మానిపోయెను.

5. చీలమండ వాపు (Swelling of the ankle)

అగ్నిహోత్ర భస్మాన్ని పైకి రుద్దుట వలన మధ్యాహ్నం వరకు వాపు పూర్తిగా తగ్గిపోయెను.

6. సర్పి (Herpes)

అగ్నిహోత్ర మలాంను పైన రుద్దుట వలన 5 రోజుల్లో తగ్గిపోయెను.

7. గోరుచుట్టు (Whitlow)

అగ్నిహోత్ర భస్మాన్ని వాచిన భాగంపై రుద్దగా మూడు, నాలుగు రోజుల్లో పూర్తిగా తగ్గిపోయెను. మొదటి రోజునే బాధ ఉపశమించెను.

8. ఎలర్జీ సంబంధమైన జ్వరం – కనుల నుండి నీరుగారుట :

Hay fever with extremely watering of eyes :

అగ్నిహోత్ర భస్మాన్ని కంటి కొలుకుల యందు రుద్దగా మధ్యాహ్నమునకే కనుల బాధ తగ్గి కంటి చుక్కలు వేయవలసిన అవసరం రాలేదు.

9. ముసలివారిలో దృష్టిమాంద్యం (Ageworn eyes)

కండ్ల కొలుకుల యందు, కంటిరెప్పల క్రింద అగ్నిహోత్ర చుక్కల మందును వేసి మృదువుగ మర్దన చేయగా ఒక్క రోజులోనే చూపు అభివృద్ధి చెందినది.

10. తీవ్ర ముక్కు దిబ్బడ (Strong nosal congetion)

అగ్నిహోత్ర మలాంను పగలు, రాత్రి ఛాతీ పైనను, వీపు పైనను ఒకవారం రుద్దగా పూర్తిగా నివారణ అయినది.

11. ముక్కులో చీమిడి (Mucus in the nose)

ఒకరికి అగ్నిహోత్ర భస్మపు ఆవిరి పీల్పించగా మధ్యాహ్నానికే నివారణ అయింది. మరియొకరికి అగ్నిహోత్ర మలాంను ముక్కుపుటాలపై రాయగా రెండు రోజుల్లో నివారణ అయింది.

12. జలుబుతో గొంతునొప్పి (Cold with Sore throat)

అగ్నిహోత్ర భస్మాన్ని తేనెతో నాకించుట వలన అతి తొందరలో గొంతునొప్పి తగ్గి నివారణ కలిగెను.

13. తామర (Ring worm)

అగ్నిహోత్రభస్మాన్ని పైకి రాయగా రెండు రోజులలో నివారణ అయ్యింది.

14. తీవ్రమైన కండరాల నొప్పి (StrongMuscle pains)

రోజుకు ఒకటి రెండుసార్లు అగ్నిహోత్ర భస్మాన్ని లోనికి తీసుకొనగా రెండు రోజుల్లో నొప్పులు పూర్తిగా పోయినవి.

15. నీళ్ళ విరేచనాలు (Diarrhoea)

అగ్నిహోత్రభస్మాన్ని ఒక్కసారి లోనికి తీసుకోగానే తర్వాత విరేచనం సాధారణంగానై క్రమంగా పూర్తి నివారణ అయ్యెను.

16. ఆసన పుట్టవ్రణం (Rectal Cancer)

రోజుకు మూడుసార్లు ఒక చెంచా అగ్నిహోత్ర భస్మాన్ని లోనికి తీసుకొనుచు రోజుకు రెండుసార్లు అగ్నిహోత్ర భస్మాన్ని పేరిననేతితో కలిపి ఆసనములోనికి ఎక్కించగ పూర్తిగా నివారణ అయ్యింది. అప్పటి నుండి మరల విరేచనంలో రక్తం రాలేదు.

17. పెరిగిన టాన్సిల్స్ (Enlarged Tonsils)

రోజుకు రెండుసార్లు అరచెంచా అగ్నిహోత్రభస్మాన్ని లోనికి యివ్వగా కొద్ది రోజులలో టాన్సిల్స్‌లోని చీము మొదలగునవి తగ్గి జ్వరం రాకుండానే సాధారణస్థితి వచ్చింది.

18. అధిక ఋతుస్రావం (Extreme Menstral Bleeding)

అగ్నిహోత్రభస్మాన్ని రోజుకు రెండు మూడుసార్లు తేనెలో కలిపి సేవించగ ఋతుస్రావం ఆగిపోయెను. ఆ విధంగా ఎనిమిది వారాల చికిత్స జరుపగా ఆమెకుఉన్న మొండి తలనొప్పి పూర్తిగ నివారణయైనది.

19. మూత్ర పిండంలో బాధ (Kidney pain)

రోజుకు రెండు మూడు సార్లు అగ్నిహోత్రభస్మాన్ని లోనికి తీసుకొనగా లోపలి విషాలు మ్యూకస్ పొరల ద్వారా బయటకు వెడల గొట్టబడి పూర్తి నివారణ కలిగెను.

20. మొండి తలనొప్పి (Migraine)

రోజుకు రెండుసార్లు అగ్నిహోత్ర భస్మాన్ని కొద్ది రోజులు తీసుకొనగా తలనొప్పి విరామ సమయం పెరిగి క్రమంగా నివారణ యైనది.

21. నరాల సంబంధమైన గొంతునొప్పి (Pressure in the throat caused by nerves)

రోజుకు మూడుసార్లు ఒక చిటికెడు అగ్నిహోత్రభస్మాన్ని లోనికి తీసుకోగా వారంలో పూర్తి నివారణ కలిగెను.

22. మొండి అల్లరి పిల్లవాడు (Difficult child)

ప్రతిరోజు సాయంత్రం ఒక చిటికెడు అగ్నిహోత్రభస్మాన్ని లోనికి యిచ్చుచు ఉదయ సాయంత్రములందు అగ్నిహోత్ర సమీపమున కూర్చుండ బెట్టుట వలన మొండితనం క్రమంగా తగ్గి ముద్దుగొలుపు పిల్లవాడయ్యెను. (From U.S Satsang Vol.15, No. 3, June 18, 1987)

**శ్రీమతి థెల్మా బుయిటానో క్యుల్బ్యు, చిలీ గారి అనుభవాలు:**

'నా తోటలో గల నొక రోగగ్రస్తమైన చెట్టును గురించి నా కనుభవమైనది. నిపుణులు ఆ చెట్టు పూర్తిగా చెడిపోయినది కావున దానిని కొట్టివేయుటకు సలహా నొసంగిరి. మనిషి గాయం వంటి గాయమే ఆ చెట్టు కుండెడిది. దానినుండి రసి కారుచుండెను.

నేను దాని చుట్టు యజ్ఞభస్మాన్ని చల్లి మొదలువద్ద కొంత భస్మం నుంచితిని. అగ్నిహోత్ర భస్మంలో నెయ్యి కలిపి ఆ గాయంలో నుంచి పైనుండి పట్టీ కట్టితిని. తర్వాత వసంతంలో నా కా చెట్టు అనేక పుష్పాలను ఫలాలను ఇచ్చింది. రెండవ సంవత్సరం కూడా రుచికరమైన ఫలాల నిచ్చెను. కాని, తక్కువ సంఖ్యలో నుండెను. సహజంగా యే చెట్టైనను ఒక సంవత్సర మిచ్చినన్ని పండ్లు మరొక సంవత్సర మియ్యదు. మరొక పండ్ల చెట్టుకునూ ఇట్టి పరిచర్య ఎంతో మేలు చేసెను.

చుట్టుప్రక్కల ప్రజలు నా గురించి ఒక వింత మాలాంతో వ్యాధులను నయం చేయు స్త్రీగా నెంచిరి. ఆ వింత మలాం నేతితో గలిపిన యజ్ఞ భస్మమే. మనుష్యులకు, పశువులకు ఇట్టి వైద్యమే జరుపుచుంటిని. ఇది చాలా ఆశ్యర్యముగ నుండెను. వంటయింటిలో నాకు కాలుట జరగినను నే నిట్టి ఓషధిని వాడుచుంటిని. దానివలన నాకు బాధగాని, మచ్చగాని ఏర్పడకుండెను.

ఒక కుక్క చెవులు జాడిస్తూ రక్తం పోయి నీరసంగా నడువలేక నా యింటిలో నున్న కుక్కగదిలో ప్రవేశించెను. నెయ్యి కలిపిన భస్మమును చేతిలో పెట్టుకొని కుక్కగదిలోనికి చెయ్యి జాపితిని. కుక్కలకు భస్మము, నెయ్యి చాలా ఇష్టము. అగ్నిహోత్రగది విషయంలో నేను చాలా జాగ్రత్తగా నుండెడిదానను. తలుపులు తీసి యుంచినచో కుక్కలు ప్రవేశించి నెయ్యి త్రాగేసేవి. నేను కుక్క

గాయంపై వరుసగా రోజూ నెయ్యి కలిపిన భస్మాన్ని పెట్టితిని. మూడవ రోజు ఆ కుక్క బయటకు వచ్చి తోక ఊపెను. కాని నీరసంగా నుండి పడిపోయెను. నాల్గవ రోజు బయటికి రాగా మూడుసార్లు అట్టి పరిచర్య జేసితిని. ఆరవరోజు నాతోపాటు షాపింగ్‌కు వచ్చెను. ఇప్పుడది బలముగ నున్నది. ఎప్పుడైన జబ్బుగ నుండినచో మా ఇంట్లో ఉన్న పిల్లివలె అగ్నిహోత్రగదిలో ప్రవేశించి నెయ్యి తినుచుండెడిది. ఇప్పుడా కుక్క చెవిపై మచ్చకూడా లేదు.

ఒక ప్రమాదంలో నేను కాలిబాటపై పడిపోతిని. ముఖం, తల రక్తసిక్తమయ్యెను. నా హితైషులు నన్ను ఆసుపత్రికి వెళ్ళవలసిందని సలహా యిచ్చిరి. నేను మాత్రం ఆసుపత్రికి పోకుండ ఇంటికి పోయి మొదట నీటిలో ఉప్పు కలిపి గాయాలను కడిగితిని. తదుపరి నెయ్యి యజ్ఞభస్మం దట్టంగా పైకి రాసితిని. అందుచేత గాయం త్వరగా మానుటయేగాక నాకు ముఖంపై యెట్టి మచ్చయు యేర్పడలేదు. ఆసుపత్రికి వెళ్ళియున్నచో ముఖానికి కుట్లుపడి కొన్ని మచ్చలు ఏర్పడెడివి.

(From U.S Satsang Vol.14, No. 24, May 7, 1987)

## శ్రీమతి అబిగేల్ డిక్, వ్యోమింగ్ గారి అనుభవాలు :

అబిగేల్ **'హోమ పద్ధతిలో వ్యాధి నివారణ'** అను విషయంపై అనేక సెమినార్లు వ్యోమింగ్‌లో ఏర్పాటు చేసినది. నవంబరులో న్యూ మెక్సికోలో స్త్రీల సమావేశంలో హోమంతో వ్యాధి నివారణ చేయు పద్ధతిపై ప్రసంగం చేసెను.

మానసిక వ్యాధులలో అగ్నిహోత్ర విధానాన్ని నేను ప్రోత్సహించుచున్నాను. నే నట్టి పరిస్థితినుండి అగ్నిహోత్రం ద్వారా విముక్తి జెందితిని. నేను పూర్తి కాలం ఇట్టి సేవకు అంకితం జేయుటకు సిద్ధంగా నున్నాను. ఈ విషయంలో అనుభవాలను వ్రాయుటకు, ఉపన్యసించుటకు సిద్ధంగా నున్నాను.

అగ్నిహోత్ర మను వరమును నా కడకు శ్రీ జెఫ్రీ హడ్జెస్ తెచ్చిరి. వారు యెట్టి షరతులు లేకుండా యీ ప్రేమ కానుకను ప్రసాదించిరి. అగ్నిహోత్రాగ్ని చాలా బలమైన ఔషధం. నాకు దురాశ, వ్యామోహం, క్రోధం, ద్వేషం,

అహంకారం నుండి కాపాడుట కొక బలమైన శక్తి అవసరం. అట్టి శక్తిగా అగ్నిహోత్రాన్ని ప్రయోగించుచున్నాను. అక్టోబర్ 1985 నుండి ఈ శక్తిని ఉపాసించితిని. మొదట ఈ శక్తిని గురించి నాకు తెలియదు. ఇందుగల దైవీశక్తిని నేను తదుపరి గ్రహించితిని. నాలో గల దురలవాట్లను పోగొట్టుకొనుటకై అగ్నిహోత్ర ఉపాసన గావించితిని.

రాగి కుండంలో అగ్నిహోత్రం చేయుచుంటిని. సూర్యోదయ, సూర్యాస్తమయ కాలములందు దీనిని జేయుచు వాతావరణాన్ని పుష్టికర మొనరించితిని.

ప్రపంచ ప్రజలందరి సుఖసంతోషాలకు యీ సాధన ఉపయుక్తమగును గాక!

(From Bharatiya Satsang January 1987, Vol 7, No. 8)

## డా. డి. కోటయ్య గుప్తగారి అనుభవాలు :

వీరు కర్నూలు జిల్లా నంద్యాల సమీపంలోని శ్రీనగరం గ్రామ వాసులు. వీరికి ఒక అరటితోట ఉన్నది. వీరి తోట చుట్టును చాలా అరటి తోటలు గలవు. 1988 జనవరి నెలలో ఆ ప్రాంతంలో అరటి తోటలకు అగ్గి తెగులు వచ్చి ఆకులువాడి కృశించి పోవుట జరిగినది. వ్యవసాయ వైద్యులిచ్చిన మందులు పనిచేయలేదు. ఆ సమయంలో వీరు వారి తోటలో 15 రోజులు వరుసగా అగ్నిహోత్రం చేసిరి. దాని వలన మేలు జరిగినది. చుట్టూ ఉన్న తోటలన్నియు అగ్గితెగులుతో నాశనంకాగా వీరి తోటలో అగ్గితెగులు ఆగి పోవుటయేగాక చెట్లు ఏపుగా ఎదిగి పెద్దపెద్ద గెలలు వేసి ఒకేసారి పక్వస్థితికి వచ్చినవి. రావలసిన తరుణాని కన్న రెండు వారాల ముందుగానే పంట సిద్ధమైనది. ఆ ప్రాంత వాసులందరు ఒక అద్భుతం చూసినట్లు ఆ తోటను దర్శించిరి.

మహబూబ్‌నగర్ వాస్తవ్యులు శ్రీ బి. సాయిలు గారు చాలా మొండి మలబద్ధకంతో బాధ పడుచుండేవారు. ఆంగ్లేయ వైద్యులు ఏమియూ చేయజాలక చిన్న ఆపరేషను చేసి మలవిసర్జనకై ఒక గొట్టమును ఏర్పాటు చేసిరి.

అయినప్పటికీ విపరీతమైన నొప్పి, ఆందోళన, నిద్ర పట్టకుండుట, కదలలేకుండుటతో చాలా బాధపడుచుండిరి. డా. కోటయ్యగుప్తగారు 11.3.1988 తేదీ నుండి వారం రోజులు ఈ రోగివద్ద అగ్నిహోత్రం చేసిరి. ఫలితం అద్భుతం. మొదటిరోజే బాధ ఉపశమించి సుఖమైన నిద్ర వచ్చినది. క్రమంగా మలబద్ధకం నివారణ అయ్యింది.

## ఇటీవలి పరిశోధన

కట్టెలలో కార్బన్ పరిమాణము అన్నిటిలో ఒకే రకంగా గాక వివిధ పరిమాణములలో నుండును. అందు కొన్నింటియందు కార్బను పరిమాణము తక్కువగాను ఆక్సిజన్ పరిమాణము ఎక్కువగాను ఉండును. అట్టి కట్టెలకు తొందరగా చెదలు - పురుగులు పట్టుచుండునని కనుగొనబడినది. ఏలనన ఆక్సిజన్ గలవి యగుటచే కట్టెలు పురుగులకు ఆహారంగా ఉపయోగపడును. అగ్నిహోత్రానికి ఉపయోగించు మామిడి, మోదుగ, రావి, జువ్వి, మేడి మొదలగు సమిధలలో ఆక్సిజన్ పరిమాణము ఎక్కువగాను కార్బన్ పరిమాణము తక్కువగాను ఉండును. అందుచేతనే వాటికి తొందరగా పురుగులు పట్టును.

ఇట్టివే కాలక్రమమున మరెన్నో వైజ్ఞానిక సత్యములు వెల్లడి కాగలవని ఆశిద్దాం.

**గమనిక:**

అగ్నిహోత్ర ఫలితాలను గురించి పలువురి అనుభవాలు వందలు, వేలు ఉన్నవి. గ్రంథ విస్తరణ భీతిచే అన్నిటిని ప్రచురించ లేక పోవుచున్నాము.

# దైనిక అగ్నిహోత్ర విధి

## కావలసిన వస్తువులు

ఇక ఈ అగ్నిహోత్రం చేయు విధానాన్ని ఆ మంత్రాల లోని భావార్థాన్ని - వైజ్ఞానికార్థాన్ని తెలిసికొందము రండు.

1. హవన కుండము: రాగి, ఇత్తడి, ఇనుము మున్నగు ఏదేని లోహంతో గాని, లేదా మట్టితోగాని చేసినదై ఉండవచ్చును. అది పై వెడల్పు 12 అం. చతురస్రము, క్రింద వెడల్పు 3 అం. చతురస్రము వచ్చునట్లు ఏటవాలు గోడలు కలిగి 12 అం. లోతు కలిగినదిగా నుండవలెను. కుండమును బోర్లించిన పిరమిడ్ ఆకారం బోలియుండును. ఇటువంటి ఆకారంలో వివిధ పరిమాణములలో చిన్నగ పెద్దగ కుండములు నిర్మించుకొనవచ్చును. కుండము చక్కగా నిలబడునట్లు క్రింద ఆధారములు (చిన్న కాళ్ళు) ఏర్పాటు చేసికొనవచ్చును. లేదా భూమిపై స్థాపితం చేసుకొనవచ్చును. గ్రామాంతరం వెళ్ళినపుడు కుండము లేనిపరిస్థితుల్లో నేలపైన కొంత ఇసుక పోసి, దానిపై సమిధలను పేర్చి అగ్నిహోత్రం చేసుకొనవచ్చును.

2. సమిధలు : మండునపుడు పొగ, దుర్గంధం రానివిగాను, బొగ్గుగా మిగులక భస్మమగునవిగాను ఉండు సమిధలను (కట్టెలను, పుల్లలను) ఉపయోగించవలెను. అందుకు మామిడి, మోదుగ, మర్రి, రావి, జువ్వి, మేడి, మారేడు మున్నగునవి అనుకూలంగా నుండును. అవి పైపట్టతో కలిసి ఎండినవిగా ఉండుట మంచిది. తులసి, అగరు, తగరు, రుద్రజడ, వట్టివేళ్ళు మొదలగు పుల్లలు కూడా ఉపయోగించవచ్చును. ఇవి ఏవియు లభింపకున్న అగ్నిహోత్రం చేయుట మానుకోవలదు. దొరికిన వాటితోనే చేయుట మంచిది. కాని, అవి పుచ్చినవి, మలినము కానివి, చాలా పాతవికానివై ఉండవలెను.

3. హోమ ద్రవ్యాలు : వీటిలో శుద్ధమైన ఆవునెయ్యి ప్రధానమైనది. ప్రతి మంత్రం చివర స్వాహా కారంతో ఒక నేతిఆహుతి ఇవ్వవలసి యుండును. ఆవునేయి లభింపకున్న శుద్ధమైన గేదెనెయ్యితో హోమం చెయ్యవచ్చును. కాని, డాల్డాతో చేయరాదు. దైనిక అగ్ని హోత్రానికి ఒక సమయమునకు సుమారు

5 తు. లేదా 50 గ్రా. నెయ్యి అవసరమగును.

ప్రాతః సాయం హవన మంత్రాల చివర నేతితోబాటు మరొకరు హోమద్రవ్యం ఆహుతిగా నివ్వవలసి యుండును. అందుకు గంధపుపొడి, కర్పూరం, అగరు, తగరు, జాజికాయ, జాపత్రి, దాల్చిన చెక్క, తాళిసపత్రి, లవంగాలు, యాలకులు, తుంగమస్తలు (గడ్డలు), ఉసిరిక, నాగకేసరాలు, అశ్వగంధ, తిప్పతీగ మొదలగు మూలికలు ; ద్రాక్ష, ఖర్జూరం, కిస్‌మిస్, అంజూరు మొదలగు ఎండిన పండ్లు ; తేనె, బెల్లం, చక్కెర మొదలగు తీపి పదార్థాలు; ఎండు కొబ్బరి, నువ్వులు, ఆక్రోటు మొదలగు నూనె గలవి; గుగ్గిలం, సాంబ్రాణి మొదలగు సుగంధ ధూపములు ; తులసి, వేప, జమ్మి, తామర మొదలగు ఎండిన ఆకులు ; గులాబి, సంపెంగ, మందార మొదలగు ఎండిన పువ్వులు ఉపయోగించ వచ్చును. వీటిలో ఆ యా కాలాల్లో లభించినవానిలో ఆర్థిక పరిస్థితి ననుసరించి కొన్నింటిని ఎంచుకొన్న చాలును. ఇవేమియు లభింపకున్నను ఏవేని బియ్యం, గోధుమలు మొదలగు కాయ ధాన్యములు పెసలు, మినుములు మొదలగు పప్పు ధాన్యములు పిండిగా చేసి ఆహుతు లివ్వవచ్చును.

మూలికలను ఋతువులనుబట్టి ఎంచుకున్న ఇంకను గుణకారిగా నుండును. సామాన్య ప్రజల సౌకర్యం కొఱకు విద్వాంసులు అన్ని ఋతువులకు అనుకూలంగా నుండు మూలికలను కొన్నిటిని సూచించిరి. వాటిని పొడిగా చేసి హవన సామగ్రి పేరుతో ఆర్యసమాజ మందిరాలలోను, సంస్థలలోను విక్రయింతురు. అక్కడి నుండి వాటిని బొంద వచ్చును.

పాత్రలు : ఆచమనం కొరకు పంచపాత్ర (చిన్న గ్లాసు) ఉద్ధరిణి (గుంట చెంచా), ప్రోక్షిణీ పాత్ర (చేయి కడుగుకొనుటకు చిన్న పళ్ళెం), ఆజ్యస్థాలి (నెయ్యి ఉంచుటకు ఒక వెడల్పు గిన్నె - అది కాడ గలిగియున్న పట్టుకుని వేడిచేయుటకు అనుకూలంగా ఉండును) చెంబుతో మంచినీళ్ళు ఉండవలెను.

మరికొన్ని చిన్న వస్తువులు : అగ్న్యాధానం చేయుటకు కర్పూరం గాని, ఎండు కొబ్బరి పొడవైన చీలికలు గాని అవసరం. లేకున్న సన్నని రెండు

సమిధలకు నేతిని రాచి వెలిగించ వచ్చును. అగ్గిపెట్టె, చేతులు తుడుచుకొనుటకు చిన్న తుండు ఉండవలెను. అవసరమైన ఉపయోగించుటకు విసనకర్ర, పట్టుకారు (చిమట) అందుబాటులో ఉంచుకొనవలెను.

యజ్ఞోపవీతం: యజ్ఞోపవీతం లేకున్న స్త్రీ పురుషులందరు యజ్ఞోపవీతం ధరించి యజ్ఞము చేయుట మంచిది. అది మన ధర్మచిహ్నం. విద్యావంతుడైన ప్రతి ఆర్యుడు (వైదిక ధర్మావలంబి, హిందువు) దీనిని ధరింప అధికారులై ఉన్నారు. ఈ విషయాన్ని వివరంగా తెలిసికొనగోరువారు మాచే ప్రచురించబడిన 'యజ్ఞోపవీత వైశిష్ట్యము' అను లఘు గ్రంథాన్ని చదువ గోరుచున్నాము. ధరించుటకు సంకోచించువారు (సాహసం చేయలేకున్న వారు) యజ్ఞోపవీతం లేకున్నను వాతావరణ శుద్ధ్యర్థం అగ్నిహోత్రం చేయవచ్చును.

సమయం: దైనిక అగ్నిహోత్రం ఉదయం సూర్యోదయానంతరమును, సాయంత్రం సూర్యాస్తమయమునకు ముందుగా చేయుట మంచిది. ఏలనన - ఉషః, సాయంకాలపు సూర్యకిరణాల ప్రభావం హోమవాయువులపైబడి ఎక్కువ లాభకారి యగునని ఆధునిక వైజ్ఞానికుల పరిశోధనలలో వెల్లడియైనది. సూర్యోదయ సూర్యాస్తమయములకు ముందు 24 ని. వెనుక 24 ని. అనగా 48 ని. ఉదయం 48 ని. సాయంత్రం అనుకూలంగా నుండునని కొందరి వైజ్ఞానికుల కథనం. ఆ సమయాల్లో వీలుపడకున్న పూర్తిగా చేయుట మానుట కన్న వారికి అనుకూలమైన సమయాల్లో చేసిన కొంతైనా లాభముండును. విశేషహోమాలకు ఈ నియమం వర్తించదు.

సంకల్పం : మన వైదిక ధర్మంలో సంకల్పం చెప్పుకొని వైదిక కర్మలు చేయుట ఆచారం. అందువలన అనంత బ్రహ్మాండంలో మన అస్తిపాస్తుల అల్పత్వం, అనంతకాలంలో మన జీవితకాల అల్పత్వం గుర్తింపబడి అహంకారం తగ్గి ఈశ్వరభక్తి, సత్కర్మల యందు ప్రేరణ కలుగును. మన సంస్కృతి సభ్యతల పట్ల శ్రద్ధ పెరుగును. ఆధునిక ఖగోళ విజ్ఞానానికి మార్గదర్శనం చేయగల మన వైజ్ఞానిక కాలగణన గుర్తుంచుకొన్నవార మగుదుము. ఈ సంకల్పమే వ్రతధారణ - వరించిన సత్కర్మ '**వ్రతేన దీక్షా మాప్నోతి, దీక్ష యాప్నోతి దక్షిణామ్**' (యజు. 19-30) అని చెప్పినట్లు వ్రతధారి ముందుగా దీక్షను

పట్టుదలను బొందును. ఆ పట్టుదలయే తదుపరి అతనికి దక్షిణను-ధనమును, కీర్తిని యిచ్చును. సాధారణంగా సంకల్పం ఈ క్రింద పేర్కొన్న విధంగా ఉండును. అందు కొన్ని మార్పులు, చేర్పులు చేసుకొనవచ్చు.

'ఓం అద్య బ్రహ్మణః ద్వితీయే ప్రహరే, ఉత్తరార్ధే, శ్వేతవరాహకల్పే, సప్తమే వైవస్వత మన్వన్తరే, అష్టావింశతితమే కలియుగే, ప్రథమ పాదే, ఏకో వృన్దః సప్త నవతి కోట్యః ఏకోన త్రింశత లక్షాణి, ఏకోన పంచశత్ సహస్రాణి శతైక త్రయోదశ తమే (197, 29, 49, 113 (23--3-12 యుగాది నాటికి) సృష్టి వత్సరే జంబూ ద్వీపే, భరత ఖండే, భారత వర్షే, ఆర్యావర్త పుణ్యభూమౌ, మేరోః దక్షిణ దిగ్భాగే, శ్రీశైలస్య వాయవ్య ప్రదేశే, కృష్ణా గోదావర్యోః (కృష్ణా కావేర్యోః) మధ్యప్రదేశే, ఆంధ్రప్రదేశాంతర్గతే ...... మండలే ........ నగరే ............. గ్రామే, స్వగృహే / వసతి గృహే, పరివార సన్నిధౌ, అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన ...... దయానందాబ్దే .......... సంవత్సరే ...... ఆయనే ........ ఋతౌ ....... మాసే ......... పక్షే ......... వాసరే ......... నక్షత్రే ............ యోగే ........... కరణే .......... ఏవం గుణ విశిష్ఠ దివసే ....... మహర్షి గోత్రోత్పన్నః .......... నామ అహం-సర్వప్రాణి బలారోగ్య సుఖసమృద్ధ్యర్థం, వైదికధర్మ రక్షణార్థం చ ప్రాతఃకాలీన / సాయంకాలీన దైనిక హోమం కరిష్యే'

(ఇందు తిథివార నక్షత్రాదులు పంచాంగం లేదా తెలుగు కేలండర్ ద్వారా తెలుసుకొన వచ్చును. యోగం, కరణం రాష్ట్రీయ పంచాంగం ద్వారా తెలియును. ఈ సృష్టివత్సరం క్రీ.శ. యుగాది 2012 నాటిది).

తదుపరి ఆచమన అంగస్పర్శలు చేయవలెను. ఈ క్రింది మంత్రాదులన్నిటికి సంక్షిప్తంగ భావార్థం వ్రాయుచున్నాము. క్రియాకలాపము నందు భావార్థాలను చదువవలసిన అవసరం లేదు. మంత్రములు చదివిన చాలును. తీరిక సమయాలలో అర్థాలను చదివి మననం చేసుకొని క్రియల నాచరించు సమయాన ఆ భావాన్ని మనసున నిలుపుకొని చేయుచుండుట మంచిది.

## ఆచమనం:

కుడి అరచేతి గుంటలో ఉద్ధరిణెడు నీళ్ళు పోసుకొని ఈ క్రింది ఒక్కొక్క మంత్రంతో ఒక్కొక్క మారుగా ముమ్మారు ఆచమనం చేయవలెను.

**ఓం అమృతోపస్తరణమసి స్వాహా** (మొదటిసారి)

హే సర్వ రక్షక ! అవినాశ స్వరూపా ! ఆసనము వలె నీవు మా క్రిందివైపున వ్యాపించియుండి మమ్ము కష్టముల నుండి రక్షించు చున్నావు. స్వాహా – మా ఈ కథనం సత్యార్థోపేతము. సత్యము.

**ఓం అమృతాపిధానమసి స్వాహా** (రెండవసారి)

హే జగద్రక్షక ! నాశరహిత ప్రభో! పై వస్త్రము వలె నీవు మా పైవైపున వ్యాపించియుండి మమ్ము కాపాడుచున్నావు.

**ఓం సత్యం యశః శ్రీర్మయి శ్రీ ః శ్రయతాం స్వాహా** (మూడవసారి)

ఓ సర్వేశ్వర ! నీ కృపవలన సత్యజ్ఞానం, కీర్తి, శోభ, సిరిసంపదలు నాయందు స్థిరంగా వసించుగాక !

## అంగస్పర్శ మంత్రములు

ఎడమ అరచేతి గుంటలో కొద్ది జలాన్నిఉంచుకొని కుడిచేతి మధ్యమ అనామిక వ్రేళ్ళను జోడించి ఆ రెంటి చివరలను ఆ నీటియందు ముంచుచు ఈ క్రింది మంత్రాలతో వరుసగా ఆయా అవయవాలను మృదువుగా తాకవలయును. ముందు కుడివైపు తదుపరి ఎడమవైపు స్పృశించవలెను.

**ఓం వాఙ్మ అస్యేఽస్తు** (పెదవులను)

ఓ ఇంద్రియ ప్రదాత! ఈశ్వర ! నీ కృపవలన నా నోటియందు వాక్‌శక్తి శక్తివంతమై స్థిరంగా నుండు గాక!

**ఓం నసో ర్మే ప్రాణోఽస్తు** (ముక్కు పుటాలను)

నా నాసికయందు ప్రాణశక్తి బలపడి స్థిరంగా నుండును గాక !

**ఓం అక్ష్ణో ర్మే చక్షు రస్తు** (కన్నులను)

నా నేత్రములందు దర్శనశక్తి స్థిరంగా నుండును గాక !

ఓం కర్ణయో ర్మే శ్రోత్ర మస్తు (చెవులను)

నా కర్ణముల యందు శబ్ద గ్రహణ శక్తి స్థిరంగా నుండును గాక !

ఓం బాహ్వో ర్మే బల మస్తు (భుజములను)

నా బాహువుల యందు యశస్సు నిచ్చు బలము నెలకొని యుండుగాక !

ఓం ఊర్వోర్మ ఓజోఽ స్తు (తొడలను)

నా తొడలయందు పరాక్రమము సదా స్థిరంగా నుండును గాక!

**ఓం అరిష్టాని మేఽ ఙ్గాని తనూ స్తన్వా మే సహ సంతు.**

(మిగిలిన నీరును శరీరముపై చల్లుకొనవలెను).

నా శరీరాంగము లన్నియు సదా నిరోగములై దుఃఖరహితములై దృఢముగా నుండును గాక ః

## ఈశ్వర స్తుతి ప్రార్థన ఉపాసనలు

మనమంతా ఆస్తికులము. ఈ బ్రహ్మాండమును సృజించి పాలించు విశ్వ వ్యాపకమైన ఒక మహత్తర శక్తి పరమేశ్వరుడు గలడని విశ్వసింతుము. ఆస్తికులు తమ ధార్మిక కర్మలు ప్రారంభించు ముందు ఈశ్వర స్తుతిప్రార్థనోపాసనలు చేయుట ఆచారము. అగ్ని హోత్రము ఒక ధార్మిక కర్మ. అందుచే పరమేశ్వర ప్రార్థనతో ప్రారంభించుట సదాచారము. ఈశ్వర స్తుతి వలన అతని గుణగణములు అవగతమై అతనియందు శ్రద్ధాభక్తులు ఇనుమడించును. ప్రార్థన వలన మన అల్పత్వము. అల్ప శక్తిమత్వము తెలిసి అహంభావము తొలగును. ఉపాసనవలన - ధ్యాన తన్మయతవలన ఆనందానుభూతి కలుగును. ఈ స్తుతి ప్రార్థనలు ఏవో మానవ నిర్మిత శ్లోకములతో గాక, ఈశ్వర నిర్మిత వేద మంత్రాలతో గావించుట శ్రేష్ఠము గాన ఋషి నిర్దేశితమైన కొన్ని వేద మంత్రాలతో స్తుతి ప్రార్థనలు చేయుదము రండు.

**ఓం విశ్వాని దేవ సవిత ర్దురితాని పరాసువ ।**
**యద్ భద్రం తన్న ఆసువ ॥** (యజుర్వేదం 30. 3)

హే దేవ సవిత ! సృష్టికర్తవైన పరమేశ్వర ! నీవు కృపతో మాలోని సమస్త దుర్గుణాలను, దుర్వ్యసనాలను, దుఃఖాలను దూర మొనర్చుము. ఏది భద్రమో, శుభమును చేకూర్చునో అట్టి గుణ కర్మ స్వభావాలను, పదార్థాలను మాకు ప్రసాదింపుము.

**ఓం హిరణ్యగర్భః సమవర్త తాగ్రే**
**భూతస్య జాతః పతిరేక ఆసీత్ ।**
**స దాధార పృథివీం ద్యా ముతేమాం**
**కస్మై దేవాయ హవిషా విధేమ ॥** (యజుర్వేదం 17-4)

సృష్టికి పూర్వం (ప్రళయ కాలమున) సూర్యాది జ్యోతిస్సులను బీజరూపంలో తన గర్భమున ధరించిన హిరణ్యగర్భుడు (పరమేశ్వరుడు) ఉండెను. అతడే సృష్టిలోని సమస్త పదార్థాలను ఎవరి సహాయం లేకయే సృజించి పాలించుచున్నాడు. అతడు ఒక్కడే, అతని ఆధారముననే ఈ పృథివీ ద్యులోకములు వాటి వాటి స్థానమున పరిభ్రమించుచున్నవి. అట్టి సుఖస్వరూపుడైన పరమేశ్వరునకు సత్కర్మలనెడు హవిస్సుతో నమస్కరించుచున్నాము.

**ఓం య ఆత్మదా బలదా, యస్య విశ్వ ఉపాసతే,**
**ప్రశిషం యస్య దేవాః ।**
**యస్య చ్ఛాయామృతం యస్య మృత్యుః**
**కస్మై దేవాయ హవిషా విధేమ ॥** (యజుర్వేదం 25-13)

ఎవడు వేదము ద్వారా ఆత్మ జ్ఞానమును, పురుషార్థసాధన జేయగల శరీరేంద్రియ మనో బలములను ఒసంగుచున్నాడో, ఎవనిని ముముక్షువులందరు ఉపాసించుచున్నారో, ఎవని అజ్ఞలను (వేదాదేశములను) విద్వాంసులు పాలింతురో, ఎవని ఆశ్రయం మోక్షసుఖ దాయకమో, ఎవని అనాశ్రయం మరణదుఃఖ దాయకమో అట్టి సుఖ స్వరూపుడైన పరమాత్మను శుద్ధాంతఃకరణ మను హవిస్సుతో ఉపాసింతుము గాక!

ఓం యః ప్రాణతో నిమిషతో మహిత్వైక
ఇద్రాజా జగతో బభూవ ।
య ఈశే అస్య ద్విపద శ్చతుష్పదః
కస్మై దేవాయ హవిషా విధేమ ॥ (యజుర్వేదం 23-3)

ఎవడు ప్రాణి అప్రాణి జగత్తున కంతకు తన మహిమతో ఏకమాత్ర రాజుగా విరాజిల్లుచున్నాడో, ఎవడు ద్విపాద చతుష్పాదాది ప్రాణుల శరీరరచన గావించుచున్నాడో అట్టి సుఖస్వరూప పరమేశ్వరునకు భక్తితో, పురుషార్థసాధనసంపత్తి యను హవిస్సుతో నమస్కరించుచున్నాము.

ఓం యేన ద్యౌరుగ్రా పృథివీ చ దృఢా
యేన స్వః స్తభితం యేన నాకః ।
యో అంతరిక్షే రజసో విమానః
కస్మై దేవాయ హవిషా విధేమ ॥ (యజుర్వేదం 32-6)

ఎవనిచే తీక్షణ స్వభావముగల సూర్యాదిలోకములు మరియు ఈ భూమియు దృఢముగా ధరింపబడియున్నవో, ఎవనిచే స్వర్గము సుఖము ధరింపబడి యున్నదో, ఎవడు మోక్షము నొసంగునో, ఎవడు ఆకాశమున సమస్త లోక లోకాంతరములను నిర్మించి త్రిప్పుచున్నాడో, అట్టి సుఖదాయక పరమేశ్వరునకు పూర్ణపురుషార్థరూప హవిస్సుతో నమస్కరించుచున్నాము.

ఓం ప్రజాపతే ! నత్వదేతా న్యన్యో
విశ్వా జాతాని పరితా బభూవ ।
య త్కామాస్తే జుహుమ స్తన్నో అస్తు
వయం స్యామ పతమో రయీణామ్ ॥ (ఋగ్వేదం 10-121-10)

ఓ ప్రజాపతీ ! పరమేశ్వర ! ఈ సమస్త ఉత్పన్న పదార్థాలను వశం చేసుకొనగలవాడు నీకన్న మరియొకడు లేడు. నీ కృప వలన ఏఏ కోరికలతో మేము నిన్ను భజింతుమో అవి మాకు సిద్ధించును గాక! మేము ధనైశ్వర్యాలకు స్వాముల మగుదుము గాక !

ఓం స నో బంధు ర్జనితా స విధాతా
ధామాని వేద భువనాని విశ్వా ।
యత్ర దేవా అమృత మానశానా
స్తృతీయే ధామ న్నధ్యైరయన్త ॥ (యజుర్వేదం 32-10)

ఆ పరమేశ్వరుడే మనకు బంధువు. జనకుడు కర్మఫల దాత. సమస్త ధామములను - భువనములను, లోకములను ఎరిగినవాడు. ఎవనిలో ముక్తులు మోక్షసుఖము ననుభవించుచు తృతీయ ధామమున స్వేచ్ఛాపూర్వకంగా విహరింతురో అట్టి దేవదేవునికి మా వందనములు.

**ఓం అగ్నే ! నయ సుపథా రాయే అస్మాన్**
**విశ్వాని దేవ వయునాని విద్వాన్ ।**
**యుయోధ్యస్మ జ్జుహురాణ మేనో**
**భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ ॥** (యజుర్వేదం 40-16)

హే అగ్నే ! ప్రకాశ స్వరూప ప్రభో ! ధనప్రాప్తికై మమ్ము మంచి మార్గాన నడుపుము. ఓ దేవ ! మా సమస్త కర్మలను నీ వెరుగుదువు. మాలోని కుటిలమైన పాప భావాలను పాప కర్మలను దూరం చేయుము. అందుకొరకే నిన్ను అత్యంత భక్తితో వేడుకొనుచు నమస్కరించుచున్నాము.

## అగ్న్యాధానము

పై స్తుతి ప్రార్థనోపాసనల అనంతరం, యజ్ఞకుండంనందు అగ్నిస్థాపన చేయవలసి యుండును. సేకరించుకున్న మంచి ఎండు సమిధలను హవనకుండమున చతురముగా చక్కగా పేర్చుకొనవలెను. తదుపరి నేతిలో ముంచిన రెండు సన్నటి కొనగలిగిన సమిధలను ఈ క్రింది వాక్యమును చదివి వెలిగించవలెను. లేదా కర్పూరముతో గాని లేక ఎండు కొబ్బరి చీలికలతో గాని వెలిగింపవచ్చును.

**ఓం భూర్భువః స్వః** (గో. గృ. సూ 1-1-11)

హే రక్షక ! సచ్చిదానంద స్వరూప ! నీ సృష్టి అత్యద్భుతము. నీవు

ప్రాణి మనుగడకొరకు భూలోకమున అగ్నిని, భువర్ లోకమున (అంతరిక్షమున) స్థిరవిద్యుత్తును, స్వర్ లోకమున సూర్యుని సృజించిన దేవ దేవుడవు. నీకు మా వందనములు.

తదుపరి యీ క్రింది మంత్రము నుచ్చరించి వెలిగించిన అగ్నిని హవనకుండ మధ్యమున నుంచవలెను.

ఓం భూర్భువః స్వర్ద్యౌరివ భూమ్నా పృథివీవ వరిమ్ణా
తస్యాస్తే పృథివి దేవయజని ।
పృష్ఠేఽగ్నిమన్నాదమన్నాద్యా యాదధే ॥ (యజుర్వేదం 3-5)

ఓ దేవ యజని! పృథివ్యాది దేవతలను సంస్కరించు ఓ యజ్ఞకుండమా! భూర్ భువర్ స్వర్ లోకాల ప్రతినిధియైన ఈ యజ్ఞాగ్ని ద్యులోకసమాన మహత్తు గలది. పృథివీసమాన శ్రేష్ఠత్వం గలది. హవ్యపదార్థాలను సూక్ష్మాతిసూక్ష్మం చేయగల శక్తిగలది. అట్టి దివ్యగుణాలు గల అగ్నిని అందు కొరకే-మే మర్పించు హవ్యముల సూక్ష్మీకరించుట కొరకే నీ మధ్యమున ఉంచుచున్నాము.

## అగ్ని సమింధనము

'అగ్ని సమింధన' మనగా అగ్ని నుత్తేజింప జేయుట-చక్కగా జ్వలింపజేయుట. స్థాపనచేసిన అగ్నిపై సన్నటి సమిధలను పేర్చిన చక్కగా జ్వలించును. అవసరమైన విసనకర్రతో నెమ్మదిగ విసరవచ్చును. కాని, నోటితో నూదరాదు.

ఓం ఉద్బుధ్యస్వాగ్నే, ప్రతిజాగృహి
త్వమిష్టాపూర్తే సం సృజేథా మయం చ ।
అస్మిన్ సధస్థే అధ్యుత్త రస్మిన్
విశ్వే దేవా యజమానశ్చ సీదత ॥ (యజుర్వేదం 15-54)

ఓ యజ్ఞాగ్నీ ! నీవు చక్కగా ప్రకాశించుము. ఉన్నతముగా జ్వలించుము. నీవును, యజ్ఞకర్తయైన యజమానియు ఇష్టాపూర్తములను (హవిర్‌యజ్ఞ సోమయజ్ఞములను) చక్కగా సంపన్నము చేయుదురు గాక! ఈ

యజ్ఞశాలయందును, ఉత్తరమందున్న సోమయజ్ఞశాలయందును విద్వాంసులు (బ్రహ్మ ఋత్విక్ అధ్వర్యు ఉద్గాతాది విద్వాంసులు) మరియు యజ్ఞకర్తలు చక్కగా ఆసీనులగుదురు గాక !

వ్యాఖ్య : కొన్ని పెద్దపెద్ద యజ్ఞములందు హవిర్యజ్ఞంతో బాటు అనగా మనము చేయబోవు ఇట్టి యజ్ఞంతోబాటు సోమ యజ్ఞమును యజ్ఞకుండమునకు కొద్ది దూరంలో ఉత్తరమువైపున నిర్వహింతురు. దైనిక అగ్నిహోత్రమునకు అట్టి రెండు యజ్ఞవేదు లవసరములేదు.

## సమిధాధానము

సమిధాధాన మనగా 3 విశేష సమిధలను శ్రద్ధతో యజ్ఞకుండమున నుంచుట. ఇందుకు సేకరించుకున్న మామిడి, మోదుగ, చందనము మున్నగు కట్టెలలో వంకరటింకరలు లేని సుమారు 8 అం ॥ పొడవు గల మూడు చక్కటి సమిధల నేరుకొనవలెను. వాటి ఒకవైపు చివరలను నేతిలో ముంచి ఈ క్రింది మంత్రముల నుచ్చరించుచు చివరి స్వాహాకారంతో అగ్ని కుండమున నొక్కొక్కటిగ నుంచవలెను.

**ఓం ఆయంత ఇధ్మ ఆత్మా జాతవేద**
**స్తేనేద్ధ్యస్వ వర్ధస్వచేద్ధ వర్ధయ చాస్మాన్ ।**
**ప్రజయా పశుభిర్ బ్రహ్మవర్చసే నాన్నాద్యేన**
**సమేధయ - స్వాహా ॥**
**ఇద మగ్నయే జాతవేదసే - ఇదం న మమ**

(అశ్వలాయన గృహ్యసూత్రాలు 1.1.12)

- అని మొదటి సమిధ కుండమున నుంచవలెను.

ఓ జాతవేదాగ్నీ! ఈ ప్రకాశమునిచ్చు సమిధ నీకు ఆత్మ - ఆధారము. కావున దీనిచే నీవు గొప్పగా ప్రకాశింపుము. మిక్కిలిగా ప్రజ్వరిల్లుము. నీ వలె మమ్ముకూడ ఉత్తమ సంతానంతోను, గో అశ్వాది పశుగణంతోను, బ్రహ్మ వర్చస్సుతోను - వేదజ్ఞానంతోను, అన్నాది పదార్థాల ననుభవించగల ఇంద్రియ

పటుత్వంతోను, శారీరక ఆత్మిక ఉన్నతులతో కూడిన సర్వతోముఖ వృద్ధితోను నిశ్చయంగ మమ్ము వర్ధిల్లజేయుము. స్వాహా - మా యీ కథనము సత్యోపేత మగును గాక ! శ్రద్ధతో మే మిచ్చు ఆహుతిని స్వీకరింపుము.

ఈ ఆహుతి ఉత్పన్న పదార్థ ప్రకాశకుడగు జాతవేదాగ్ని కొరకే. నాకొరకు కాదు. ఇది నాది కాదు. నేను సృజించినదికాదు. పరమేశ్వర నిర్మితమే. (ఇట్టి స్వాహాకారము ప్రతి ఆహుతి చివర చెప్పుట జరుగును. దీనివల్ల అహంకార త్యాగము - తద్వార ఈశ్వర ప్రాప్తి కలుగును.)

ఓం సమిధాగ్నిం దువస్యత, ఘృతైర్బోధయతాతిథిమ్,
ఆస్మిన్ హవ్యా జుహోతన స్వాహా ॥ (యజుర్వేదం 3-1)
ఇద మగ్నయే- ఇదం నమమ.

ఓం సుసమిద్ధాయ శోచిషే, ఘృతం తీవ్రం జుహోతన,
అగ్నయే జాతవేదసే - స్వాహా (యజుర్వేదం 3-2)
ఇదమగ్నయే జాతవేదసే - ఇదం న మమ.

యీ రెండు మంత్రాలతో రెండవ సమిధ నుంచవలెను.

పరమేశ్వరుని ఉపదేశము:

ఓ మానవులారా ! సమిధలతో అగ్నిని చక్కగా జ్వలింపజేయుడు. అతిథిని (తిథి లేక దేశ సంచారం చేయుచు ధర్మోపదేశం జేయు సాధు సంన్యాసులను) ఆహారాదు లొసగి శ్రద్ధాభక్తులతో సేవించునట్లు యీ యజ్ఞాగ్నిని ఘృతంతో సేవింపుడు. అట్లు ప్రదీప్తమైన అగ్నియందు హవనీయ పదార్థాలను హోమం చేయుడు.

చక్కగా ప్రదీప్త మొనర్చబడినదియు, శోచిషే అన్నింటిని సంస్కరించ గలదియు, జాతవేదసే - ఉత్పన్న వస్తువుల ప్రకాశింపజేయగలదియు నగు అగ్నికి తీవ్ర ఘృతమును అనగా వేడిచేసి చక్కగా కరిగించిన నేతిని శక్తికొలది అధికముగ ఆహుతుల నిండు. (శక్తి గలవారు కస్తూరి, కేసరి మొదలగు వాటిని కరిగిన నేతిలో కలుపవచ్చును).

ఆహుతుల తదుపరి ఉచ్చరించే 'స్వాహా, ఇదం న మమ' మాటలకర్థం పూర్వం వివరించినట్లే గ్రహింపవలెను.

**ఓం. తన్త్వా సమిద్భి రంగిరో, ఘృతేన వర్ధయామసి**
**బృహచ్ఛోచా యవిష్ఠ్య - స్వాహా** (యజుర్వేదం 3.3)
**ఇద మగ్నయేఽ౦గిరసే - ఇదం న మమ.**

అని యజ్ఞకుండమున మూడవ సమిధ నుంచవలెను.

ఓ అంగిరాగ్నీ ! ప్రసిద్ధమగు నిన్ను సమిధలతో, నేతితో వృద్ధి పరచుచున్నాము. దానితో నీవు ఉన్నత శిఖలను బొంది మా హవిస్సులను యవిష్ఠ్య - అణువులుగా, పరమాణువులుగా మార్చుదువు గాక !

వ్యాఖ్య : ఈ సమిధాధానంలో మొదటి సమిధ నుంచుచు **'ఇదమగ్నయే ఇదన్నమమ'** అని చెప్పుదుము. ఇది భూలోక మందున్న సామాన్య అగ్నికి వర్తించును. దాని శక్తి పరిమితం. రెండవ సమిధ నుంచుచు **'ఇదమగ్నయే జాతవేదసే'** అని చెప్పుదుము. ఇది అంతరిక్ష మందున్న జాతవేదాగ్నికి చెందును. అంతరిక్షంలో స్థిర విద్యుత్తురూపాన అగ్ని యుండును. అది ఉత్పన్న పదార్థాలను ప్రకాశింప జేయును. అనగా కనబడునట్లు జేయును. గాన, అది జాత - పుట్టిన వాటిని, వేదః-తెలుపునది. దాని శక్తి భూలోకాగ్ని కన్న కొంత విశాలం. ఇక మూడవ సమిధ నుంచుచు **'ఇదమగ్నయే అంగిరసే'** అని చెప్పుదుము. ఇది ద్యులోకమందున్న అంగిరాగ్నికి వర్తించును. ద్యులోక మందున్న అగ్నిని అంగిరాగ్ని యందురు. అనగా **'ప్రతి వస్తువును ప్రాప్తించున'** దని అర్థం. అది సూర్యుడు కేంద్రంగా సూర్యకుటుంబాని కంతకు వ్యాపించును. ఆ అగ్నియే ప్రాణులన్నిటిని చైతన్యవంతం చేయుచుండును. వృక్షాల ద్వారా స్వీకరింపబడి ప్రాణుల కాహారమై పనిచేయు శక్తి నిచ్చుచుండును. మేఘాల నిర్మాణానికి, షడ్ఋతువుల సమతుల్యతకు అదియే ముఖ్య కారణం. అట్టి అంగిరాగ్నికి ఆహుతి నర్పించవలెనన్న మంటను ఉన్నతం గావింపవలసి యుండును. అట్టి ప్రజ్వలితాగ్ని 'యవిష్ట' యగును. అట్టి అగ్నియే హోమ ద్రవ్యాలను

సూక్ష్మతమముగా - అణువులుగా పరమాణువులుగా మార్చగలుగును. అప్పుడా సూక్ష్మద్రవ్యం భూ ఆకర్షణ పరిధిని దాటిపోయి ద్యులోకాన సూర్యుని సంస్కరింప సమర్థవంత మగును.

## పంచ ఘృతాహుతులు

ఈ క్రింది మంత్రాన్ని 5 సార్లు చదివి, 5 ఆహుతులు ఘృతంతో నివ్వవలెను.

**ఓం ఆయన్త ఇధ్మ ఆత్మా జాతవేద**
**స్తేనేధ్యస్వ వర్ధస్వ చేద్ధ వర్ధయ చాస్మాన్**
**ప్రజయా పశుభిర్బ్రహ్మ వర్చసే**
**నాన్నా ద్యేన సమేధయ - స్వాహా**
**ఇదమగ్నయే జాతవేదసే-ఇదం న మమ.**

దీని భావార్థం పూర్వమే (సమిధాధాన మంత్రాలలో) వ్రాయబడినది. అచ్చట ఇధ్మపదానికి సమిధ అను అర్థం చెప్పుకొనుట జరిగినది. ఇచ్చట ప్రకరణమునుబట్టి ఇట్టి ఇధ్మ పదమునకు నెయ్యి అనునర్థం చెప్పుకొనవలెను. ఒకే మంత్రం 5 సార్లు చదివి 5 ఆహుతులిచ్చుటకు కారణ మేమన - ఈ మంత్రమునందు 5 కోర్కెలు (1. ఉత్తమ సంతానం, 2. గో అశ్వాది పశుగణం, 3. బ్రహ్మ వర్చస్సు, 4. అన్నాది భోగ్య వస్తువుల ననుభవింపగల ఇంద్రియ పటుత్వం, 5. సర్వతోముఖ ఉన్నతి) కోరబడినవి. అందుచే పంచ ఘృతాహుతులిచ్చు విధాన మేర్పర్చబడినదని కొందరు విద్వాంసుల కథనం.

## జల ప్రసేచనము

ఈ క్రింది మంత్రాలతో అగ్ని కుండానికి నలువైపుల క్రమంగా తూర్పు, పడమర, ఉత్తర, దక్షిణ దిక్కులందు ఆ యా క్రమాలలో నీళ్ళు చిలకరించవలెను. లేదా పోయవలెను.

**ఓం అదితేఽనుమన్యస్వ**

సంయోగింప జేయగల ఓ జలమా ! ఈ యజ్ఞాగ్నికి అనుకూలంగా

నుండి తూర్పు దిశనుండి కాపాడుచుండుము. (ఈ మంత్రంతో యజ్ఞ కుండానికి తూర్పు దిక్కున దక్షిణము నుండి ఉత్తరానికి నీటిని పోయవలెను. - చిలకరించవచ్చును.)

**ఓం అనుమతేஉనుమన్యస్వ**

అన్నిటికి అనుకూలంగా నుండు ఓ జలమా! పశ్చిమ దిశ యందుండి ఈ యజ్ఞాగ్నిని కాపాడుము. (పడమట వైపున దక్షిణం నుండి ఉత్తరానికి)

**ఓం సరస్వత్యనుమన్యస్వ** (గోభిలాయన గృహ్యసూత్రాలు 1-3-1,2,3)

గతివంతమై ప్రవహించు ఓ జలమా! ఉత్తర దిశయందుండి ఈ యజ్ఞాగ్నిని కాపాడుము (ఉత్తర దిక్కునందు పడమర నుండి తూర్పునకు)

**ఓం దేవ సవితః ప్రసువ యజ్ఞం**
**ప్రసువ యజ్ఞపతిం భగాయ ।**
**దివ్యో గంధర్వః కేతపూః కేతం**
**నః పునాతు వాచస్పతిర్వాచం నః స్వదతు ॥** (యజుర్వేదం 3-1)

ప్రేరకగుణం గల ఓ దివ్య జలమా! మా యజ్ఞాన్ని ప్రేరేపింపుము. ఐశ్వర్య ప్రాప్తికై యజ్ఞపతియైన యజమానుని ప్రేరేపింపుము. దివ్య శక్తులతో కూడి భూమిని ధరించియున్న ఓ జలమా! నీవు శరీరములను పవిత్రం (ఆరోగ్యవంతం) చేయుదానవు. గాన, మా శరీరాలను పవిత్రపరతువు గాక. మా వాణిని మధురం చేయుదువు గాక !

(ఈ మంత్రంతో దక్షిణం నుండి ప్రారంభించి యజ్ఞకుండానికి నలు వైపుల జలమును చిలకరించవలెను)

వ్యాఖ్య : ఈ మంత్రంలో నీటి గుణాలు కీర్తింప (వర్ణింప) బడినవి. నీరు **'ప్రసువ యజ్ఞం'** - యజ్ఞమును ప్రేరేపించును. అందుచేతనే ఋషులు ఆచమనక్రియతో యజ్ఞము నారంభించు విధాన మేర్పరచిరి. ఇంతేగాక, ఈ యజ్ఞకార్యము నందును జలము ఆవశ్యకమే. పూర్వ పుటలలో తెలుపబడినట్లు యజ్ఞవాయువు నందలి ముఖ్య వాయువులైన ఫార్మల్‌డీహైడ్ మొదలగునవి.

నీటియావిరితో కలిసి యున్నప్పుడే ఎక్కువ గుణకారిగా నుండును. దీనితోపాటు అగ్ని యున్నచోట జల మవసరమగును. కొందరు చీమలు మొదలగు అల్ప ప్రాణులు యజ్ఞవేదిక సమీపానికి వచ్చి చనిపోకుండుటకు ఈ క్రియ చేయబడునందురు. అదియును సమంజసంగానే యున్నది. ఏలనన అగ్నిహోత్రానికి 'అధ్వర' మని పేరు. అనగా 'హింసలేని పవిత్ర కర్మ' అని అర్థం. అందుకే ఈ క్రియతో ఆజాగ్రత్తను గుర్తించిన వారమగుదుము. మరికొందరు భూమిచుట్టూ నీరు (సముద్రాలు) ఉన్నట్లే దానికి ప్రతీకగా యజ్ఞకుండం చుట్టూ నీరు పోయుట జరిగినదని అందురు.

ధనం గలవాడే చక్కగా యజ్ఞమునాచరింప గలడు. అందుచేతనే 'ప్రసువ యజ్ఞ పతిం భగాయః' ఐశ్వర్య ప్రాప్తికై యజ్ఞపతికి ప్రేరణ నిమ్మని కోరుట జరిగినది. భూమికి నాలుగువైపుల సముద్ర మున్నది. అందువలననే భూ వాతావరణం ప్రాణి మనుగడ కనుకూలంగా నున్నది. అందుచే నీరు **గంధర్వః (గామ్ పృథివీ ధరతి ఇతి గంధర్వః)** గామ్ - భూమిని, ధర్వః - ధరించినది. అది దివ్యమైనది. ఆ నీరు **కేతపూః** - శరీరములకు లోపల బయట పవిత్రం చేయును గాన **'నః కేతుమ్ పునాతు'** - మా శరీరాలను పవిత్రం చేయవలెనని కోరుట జరిగినది. నీరు **వాచస్పతిః** - స్వర పేటికను పాలించునది. మాట్లాడునపుడు రూక్షత రాకుండ కాపాడును గాన **'నః వాచమ్ స్వదతు'** మన వాణిని మధురం చేయ గోరితిమి.

## అఘూరావాజ్య భాగాహుతులు

అఘూరా అనగా ఒక విశేష పద్ధతిలో నేతితో ఆహుతి నిచ్చుట. ఆ పద్ధతి ఏమన - యజ్ఞవేదియందలి అగ్నిలో పడమటినుండి తూర్పునకు ధారగా, పొడవుగా, సరళ రేఖవలె రెండు ఆహుతులు. ఒకటి ఉత్తర భాగాన, రెండవది దక్షిణ భాగాన ఇవ్వవలెను. దీనినే శాస్త్రాలు **'ఋజు మాఘూరయతి, దీర్ఘ మాఘూరయతి, సంతత మాఘూరయతి'** యని చెప్పును.

ఓం అగ్నయే స్వాహా,

ఇద మగ్నయే - ఇదం న మమ (యజుర్వేదం 22.27)

(ఉత్తరపు వైపు అగ్నియందు పై విధంగా)

ప్రకాశ, తీక్ష్ణ గుణాలుగల అగ్నికి ఈ ఆహుతి నర్పించుచున్నాను.

**ఓం సోమాయ స్వాహా,**

**ఇదం సోమాయ - ఇదం న మమ.** (యజుర్వేదం 22.28)

సౌమ్య, శాంత గుణాలుగల అగ్నికి ఈ ఆహుతి నర్పించుచున్నాను.

<u>వ్యాఖ్య :</u> యజ్ఞ వేధిని భూమికి అన్వయించుటకు గాను ఋషులు ఈ విధాన మేర్పరచి యుందురు. భూమియొక్క ఉత్తర, దక్షిణ ధృవములందు అయస్కాంత ధృవము లున్నట్లే, వాటి గుణాలను తెలుపునట్లుగా ఈ క్రియా విధాన మేర్పరచిరి. ఉత్తర ధృవము ధన విద్యుత్‌తో అగ్నివలె నుండును. దక్షిణ ధృవము ఋణ విద్యుత్‌వలె సౌమ్యంగా నుండును. భూమి పడమటినుండి తూర్పునకు పరిభ్రమించుచుండును. గాన దాని కనుగుణంగానే ఈ ఆహుతుల క్రియా విధానం కూడా పడమటి నుండి తూర్పునకు ధారగా వేయునట్లేర్పర్చబడినది.

## ఆజ్య భాగాహుతులు

ఈ క్రింది మంత్రాలతో యజ్ఞాగ్ని మధ్యభాగాన నేతితో ఆహుతు లీయవలెను.

**ఓం ప్రజాపతయే స్వాహా**

**ఇదం ప్రజాపతయే - ఇదం న మమః** (యజుర్వేదం 18.27)

ప్రజలను పాలించు - పోషించు అగ్నికొరకు ఈ ఆహుతి నిచ్చుచున్నాను.

**ఓం ఇంద్రాయ స్వాహా**

**ఇద మింద్రాయ - ఇదం న మమ** (యజుర్వేదం 22.28)

వివిధ ఐశ్వర్యాల నిచ్చు అగ్నికొరకు ఈ ఆహుతి నిచ్చుచున్నాను.

<u>వ్యాఖ్య :</u> ఈ రెండాహుతులు అగ్ని హోత్రం యొక్క ముఖ్య గుణాలను తెలుపుచున్నవి. అగ్నిహోత్రం ప్రజలను ఆరోగ్యవంతులుగా,

బలవీర్యవంతులుగా జేయును. గాన, ఇది ప్రజాపతి. దీని ద్వారా ఎన్నెన్నో ఐశ్వర్యాలను బొందవచ్చును. ఇంతేగాక, ఇది పుత్రేచ్ఛ, వర్షేచ్ఛ, సామ్రాజ్యేచ్ఛ మొదలగు ఎన్నెన్నో కోరికలను తీర్చును. కాన ఇది ఇంద్రుడనబడును.

## దైనిక అగ్నిహోత్ర ప్రధాన ఆహుతులు

ఈ ఆహుతు లిచ్చు మంత్రాలు ఉదయ సాయంకాలాలకు వేరు వేరుగా నుండును. ఏ కాలమున కా మంత్రాలతోనే హోమం చేయవలెను. నేతి ఆహుతులతోబాటు మరొకరు పూర్వం సూచింపబడిన హోమద్రవ్యాలలో నేవేని కొన్నిటిని స్వాహా కారంతో ఆహుతిగా నివ్వలెను. ఒక్కరే చేయుచున్నచో నేతి ఆహుతి నిచ్చి తదుపరి హోమద్రవ్యంతో ఆహుతి నివ్వవచ్చును.

## ప్రాతఃకాల ఆహుతులు

**ఓం సూర్యో జ్యోతిర్జ్యోతిః సూర్యః స్వాహా**

సూర్యుడు ప్రకాశ స్వరూపుడు. ప్రకాశమే సూర్య స్వరూపం. ఆ ప్రకాశమునకే ఈ ఆహుతి.

**ఓం సూర్యో వర్చో జ్యోతిర్వర్చః స్వాహా**

సూర్యుడు వర్చస్వరూపుడు. ప్రకాశమే అతని వర్చస్సు. ఆ వర్చస్సునకే ఈ ఆహుతి.

**ఓం జ్యోతిః సూర్యః సూర్యో జ్యోతి : స్వాహా**

జ్యోతియే సూర్యుడు. సూర్యుడే జ్యోతి. ఆ సూర్యునికే ఈ ఆహుతి.

**ఓం సజూ ర్దేవేన సవిత్రా సజూ రుషసేంద్రవత్యా**

**జుషాణః సూర్యో వేతు స్వాహా** (యజుర్వేదం 3-9,10)

సవితా దేవునిచే సృష్టించబడి ఈ జగత్తుతో సదా వర్తమానుడై యుండి, ప్రకాశవంతమగు ఉషఃకాలంతో కూడినవాడై అంతటా ప్రకాశించు సూర్యునకు ఈ ఆహుతి నర్పించుచున్నాను.

## సాయంకాల ఆహుతులు

**ఓం అగ్నిర్జ్యోతి ర్జ్యోతి రగ్నిః స్వాహా**

అగ్ని ప్రకాశ స్వరూపుడు. ప్రకాశమే అగ్ని స్వరూపం. ఆ ప్రకాశాగ్నికే ఈ ఆహుతి.

**ఓం అగ్ని ర్వర్చో జ్యోతి ర్వర్చః స్వాహా**

అగ్ని వర్చః స్వరూపుడు. ప్రకాశమే అతని వర్చస్సు. ఆ వర్చస్సాగ్నికే ఈ ఆహుతి.

**ఓం అగ్ని ర్జ్యోతి ర్జ్యోతి రగ్నిః స్వాహా** (మౌనంగా)

(మొదటి మంత్రమే ఇచట పునరావృత్తమైనది. అందుచే మనస్సులోనే ఈ మంత్రం నుచ్చరించి మౌనంగా ఈ ఆహుతి నీయవలెను. అర్థం మొదటి మంత్రానికి వలెనే గ్రహించవలెను.)

**ఓం సజూర్దేవేన సవిత్రా సజూ రాత్ర్యేంద్రవత్యా**
**జుషాణో అగ్నిర్వేతు స్వాహా** (యజుర్వేదం 3-9,10)

సవితచే - సృష్టికర్తయైన పరమేశ్వరునిచే సృజింపబడి యీ జగత్తుతో సమానంగా వర్తమానమైయుండి, రాత్రులందు తారా చంద్ర విద్యుత్ కాంతులతో కూడినదై అంతటా వ్యాపించి యుండు అగ్ని కొరకు ఈ ఆహుతి నర్పించుచున్నాను.

వ్యాఖ్య : దినమంతయు సూర్యునివలన, రాత్రంతయు జాతవేదాగ్ని వలన స్థావర జంగమ ప్రాణులన్నియు ప్రకాశమును, వర్చస్సును బొందుచుండును. అవి లేకున్న కాంతి విహీనములై గాఢాంధకారమున చైతన్యరహితమై పడియుండును. వాటిని సంస్కరించి చైతన్యవంతము చేయగల శక్తి అగ్నిహోత్రాని కున్నది. అందుచే దిన ప్రారంభమైన ఉషఃకాలమునందు సూర్యునికి, రాత్రి ప్రారంభము కాబోతున్న సూర్యాస్తమయ సమయమున అగ్నికి ఈ ఆహుతులనిచ్చుట జరిగినది.

## ప్రాతస్సాయం (రెండు సమయములందు) ఇచ్చు ఆహుతులు

ఉదయం చేసినను, సాయంత్రం చేసినను ఈ క్రింది మంత్రము లన్నిటితో నేతిని, హోమద్రవ్యమును కూడ ఆహుతులుగా నివ్వవలెను.

ఓం భూరగ్నయే ప్రాణాయ స్వాహా

**ఇద మగ్నయే ప్రాణాయ - ఇదం న మమ**

శరీరమున ప్రాణవాయువు వలె భూలోక మందుండు అగ్నికి ఈ ఆహుతి నిచ్చుచున్నాను.

**ఓం భువ ర్వాయవేఽపానాయ స్వాహా**

**ఇదం వాయవేఽపానాయ-ఇదం న మమ**

మల మూత్రాదుల బోనాడు అపాన వాయువువలె కాలుష్య నివారణ చేయుచు భువర్లోకమున (అంతరిక్షమున) నుండు వాయువునకు ఈ ఆహుతి నిచ్చుచున్నాను.

**ఓం స్వ రాదిత్యాయ వ్యానాయ స్వాహా**

**ఇద మాదిత్యాయ వ్యానాయ-ఇదం న మమ**

శరీరము నందంతటను వ్యాపించుచు సుఖమునిచ్చు వ్యానవాయువువలె ద్యులోకమున నుండు సూర్యునకు యీ ఆహుతి నిచ్చుచున్నాను.

**ఓం భూర్భువః స్వ రగ్ని వాయ్వాదిత్యేభ్యః**

**ప్రాణాపానవ్యానేభ్యః స్వాహా**

**ఇద మగ్ని వాయ్వాదిత్యేభ్యః**

**ప్రాణాపానవ్యానేభ్యః-ఇదం న మమ.**

శరీరము నందలి ప్రాణాపానవ్యానముల వలె భూ భువర్ స్వర్ లోకములోని అగ్ని వాయు ఆదిత్యులకొరకు ఈ ఆహుతి నిచ్చుచున్నాను.

## ఈశ్వర ప్రార్థనతో ఆహుతులు

**ఓం ఆపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువః స్వరోం స్వాహా**

ఓ పరమేశ్వరా! నీవు ఆపః = అంతటా వ్యాపించి యుండువాడవు. జ్యోతిః= ప్రకాశ స్వరూపుడవు. రసః = ప్రేమరస స్వరూపుడవు. అమృతం = నాశరహితుడవు. బ్రహ్మ = అన్నిటికన్న గొప్పవాడవు. భూర్భువః స్వః = సచ్చిదానంద స్వరూపుడవు. ఓ3మ్ = సర్వ సంరక్షకుడవు. స్వాహా = అట్టి నీ కొరకే ఈ ఆహుతి నర్పించుచున్నాను. (ఈ ఆహుతిని సమర్పణ ఆహుతి యని కూడ అనవచ్చును) సత్కర్మల ఫలమును శ్రద్ధా భక్తులతో ఈశ్వరార్పణ చేయుట వైదిక శిష్టాచారం.)

**ఓం యాం మేధాం దేవగణాః పితర శ్చోపాసతే ।**
**తయా మా మద్య మేధయాగ్నే మేధావినం కురు స్వాహా ॥**

(యజుర్వేదం 32.14)

ఓ అగ్నీ ! ప్రకాశ స్వరూప పరమేశ్వర ! ఏ మేధస్సును – శ్రేష్ఠ బుద్ధిని విద్వాంసులు, జ్ఞానులు ఉపాసించుచున్నారో – కోరుచున్నారో అట్టి మేధాబుద్ధితో ఇప్పుడే నన్ను మేధావంతుని జేయుము. స్వాహా – ఈ కథనం సత్యోపేత మగును గాక ! అందుకొరకే యీ ఆహుతి నర్పించుచున్నాను.

**ఓం విశ్వాని దేవ సవిత ర్దురితాని పరాసువ ।**
**యద్భద్రం తన్న ఆసువ స్వాహా ॥** (యజుర్వేదం 30.3)

**ఓం అగ్నే! నయ సుపథా రాయే అస్మాన్**
**విశ్వాని దేవ వయునాని విద్వాన్ ।**
**యుయోధ్యస్మ జ్జుహురాణ మేనో**
**భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ స్వాహా ॥** (యజుర్వేదం 40.16)

(ఈ రెండు మంత్రాల భావార్థం ప్రార్థనా మంత్రాలలో మొదటి, చివరి మంత్రాలలో గలదు)

## గాయత్రీ మంత్రంతో ఆహుతులు

ఓ3మ్ భూర్భువః స్వః తత్సవితుర్వరేణ్యమ్ ।
భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్ స్వాహా

(ఋ. 3-62-10, యజు. 3.35, 22-9, 30.2,36.3, సామ 2462, అనేక సంహితా బ్రాహ్మణ ఆరణ్యకములందును గలదు)

హే రక్షక ! సచ్చిదానంద స్వరూప ! జగదుత్పాదక దేవ ! నీ దివ్య గుణయుక్తము, వరేణ్యము నగు శుద్ధ విజ్ఞాన స్వరూపమును మేము నిత్యము మా హృదయమున ధ్యానింతుము గాక ! నీవు మాకు సద్బుద్ధి నిచ్చి సత్కర్మల నాచరించునట్లు ప్రేరేపింతువు గాక !

పై గాయత్రీ మంత్రంతో మూడు పర్యాయాలు లేదా అవకాశమును బట్టి ఎక్కువ పర్యాయాలు ఆహుతు లివ్వవచ్చును.

## పూర్ణాహుతి

ఈ క్రింది ఒక్కొక్క మంత్రంతో ఒక్కొక్క నిండు గరిటెడు నేతిని ఆహుతులుగ నివ్వవలెను.

**ఓం సర్వం వై పూర్ణం స్వాహా (1)**

**ఓం సర్వం వై పూర్ణం స్వాహా (2)**

**ఓం సర్వం వై పూర్ణం స్వాహా (3)**

తదుపరి స్రువను (నేతి గరిటెను) ప్రక్కకు పెట్టి గిన్నెను కుడిచేత పట్టుకొని మిగిలియున్న నేతిని కూడ అగ్నిహోత్రంనందే వంచి గిన్నెను ఖాళీ చేయవలెను.

హే రక్షక ! నీ కృప వలన ఈ అగ్నిహోత్ర కార్యం నిశ్చయంగ పూర్తియైనది.

వ్యాఖ్య : ఇచ్చట మూడు ఆహుతు లిచ్చుటకు కారణము ఇవి కార్య సమాప్తిని తెలుపును. ఈ ఆహుతులు ఈశ్వర రచితమైన త్రిలోకములు - భూ అంతరిక్ష ద్యు లోకములు పూర్ణము లనియు, అందు ఏ కొరతయు లేదనియు

తెలుపును. అట్లే, ఈ అగ్నిహోత్రం కూడా త్రిలోకముల పూర్ణం చేయును. పరమేశ్వరుడు పూర్ణుడు. పరమేశ్వరుని సృష్టి పూర్ణం. పరమేశ్వర జ్ఞానమును (వేదమును) పూర్ణమే.

## ప్రార్థన

అనంతరం నేతిగిన్నెలో కొన్ని చుక్కలు నీరుపోసి గిన్నెకు అంటిన నేతిని, నీటిని కలిపి రెండు అరచేతులకు రాచుకొనవలెను. ఆ అరచేతులను యజ్ఞాగ్నికి కొద్దిగా కాచుకొని (వేడి చేసుకొని) వాసన చూచుచు ఈ క్రింది మంత్రాలను భావసహితంగా నుచ్చరించుచు ప్రార్థన చేయవలెను. ఒక్కొక్క మంత్రంతో నొక్కొక్క పర్యాయం కాచుకొని వాసన చూడవలెను.

**ఓం తేజోఽసి తేజో మయి ధేహి**

హే సర్వ సంరక్షక ! సర్వేశ్వర ! నీవు తేజో స్వరూపుడవు. దయతో నా యందును తేజస్సును నింపుము.

**ఓం వీర్య మసి వీర్యం మయి ధేహి**

హే రక్షక ! నీవు అనంత పరాక్రమ యుక్తుడవు. నీ కృపా కటాక్షముచే నా యందును పూర్ణ పరాక్రమము నుంచుము.

**ఓం బల మసి బలం మయి ధేహి**

ఓ దేవ ! నీవు అనంత బలయుక్తుడవు. నీ అనుగ్రహంతో నాకును పూర్ణ బలమును ప్రసాదించుము.

**ఓం ఓజోఽసి ఓజో మయి ధేహి**

హే జగద్రక్షక ! నీవు అనంత సామర్థ్య యుక్తుడవు. నాకును పూర్ణ సామర్థ్యమును ప్రసాదింపుము.

**ఓం మన్యు రసి మన్యుం మయి ధేహి**

ఓ న్యాయకారి! నీవు దుష్టుల యందును, దుష్ట కార్యములందును క్రోధకారివి. దయచేసి నన్నును అట్లే కావింపుము.

ఓం సహో౽సి సహో మయి ధేహి (యజుర్వేదం 19.9)

హే సహనశీల పరమేశ్వర! నీవు నిందాస్తుతుల యందును, నీ కపరాధము చేయువారి యెడలను సహనం కలవాడవు. నీ కృపచే నేనును అట్లే యగుదును గాక !

వ్యాఖ్య : ఈ క్రియ యందలి వైజ్ఞానిక ప్రయోజన మేమన- యజ్ఞాగ్ని నుండి వెడలు వాయువులు స్రువకు (నేతి గరిటెకు) ఎక్కువగ తాకుచుండును. ఆ గరిటె మరల మరల నేతి గిన్నెలో ముంచుట జరుగుచుండును. అందుచే క్రమంగా గిన్నెలో నున్న నేయి ఔషధీయుక్త మగుచుండును. చివరగా మిగిలియున్న ఆ కొద్ది నెయ్యియే శక్తివంతమైన ఔషధ మగును. దానిని చేతులకు రాచుకొని మరల యజ్ఞాగ్నికి కాచుకొని వాసన చూచుట వలన ప్రయత్న పూర్వకంగా యజ్ఞవాయువును ఎక్కువగా స్వీకరించినవార మగుదుము. ఆ శేషఘృతమునే యజ్ఞశేష మనియు యజ్ఞప్రసాద మనియు అందురు. దీనిని వాసన చూచుటయేగాక ముఖమునకు, శరీరమునకు రాచుకొన వచ్చును. లోపలికి సేవింపవచ్చును.

## సత్సంగము

అనంతరం అవకాశమునుబట్టి కొంత సమయం స్వాధ్యాయం చేయుట మంచిది. స్వాధ్యాయమునందు పరమేశ్వర వాణియైన వేదాలను గాని, ఋషి మునుల ఉపనిషత్ మనుస్మృత్యాది గ్రంథాలను గాని పఠించవలెను. అంత యోగ్యత లేనివారు పై గ్రంథముల సారాంశమైన సత్యార్థ ప్రకాశము, ఋగ్వేదాది భాష్యభూమిక, ఋగ్ యజుర్వేద భాష్యములు, ఆర్యాభివినయము మొదలగు మహర్షి దయానందుని గ్రంథములు చదువుకొనుట ఉపయుక్తముగా నుండును. ఇంకను సమయం మిగిలియున్న కొన్ని భజనలు పాడుకొన వచ్చును. విశ్వశాంతిని గోరు శ్లోకములు, మంత్రములు పఠింప వచ్చును.

ప్రాచీన వైదిక సాంప్రదాయము ననుసరించి అగ్నిహోత్రంతో బాటు రెండు సంధ్యాసమయములందును సంధ్యావందనం చేయవలెను. ఉదయం అగ్నిహోత్రానికి ముందుగాను, సాయంత్రం అగ్నిహోత్రం తదుపరి సంధ్య

చేయుటకు అనుకూల సమయాలు. సంధ్యావందనంలోని వైజ్ఞానిక భావాలను మరొక గ్రంథంలో "సంధ్యావందనం - వైజ్ఞానిక సమాలోచనం" లో వివరింపబడినవి.

## శాంతి పాఠం

చివరగా ఈ క్రింది యజుర్వేద శాంతిమంత్ర పఠనంతో సత్సంగం ముగించవలెను.

**ఓం ద్యౌః శాంతి రంతరిక్షం శాంతిః పృథివీ శాంతి**
**రాపః శాంతి రోషధయః శాంతిః, వనస్పతయః శాంతి**
**ర్విశ్వే దేవాః శాంతి ర్బ్రహ్మశాంతిః, సర్వం శాంతిః**
**శాంతిరేవ శాంతిః, సా మా శాంతి రేధి ॥** (యజుర్వేదం. 36.17)

హే సర్వ సంరక్షక ! సర్వంతర్యామిన్ దేవా ! నీ కృపవలన ద్యు అంతరిక్ష పృథివీ లోకములు మాకు శాంతి దాయకములగునుగాక ! జల ఔషధీ వనస్పతులు, సమస్త విద్వాంసులు, వేదం, సంపూర్ణ ప్రపంచం మాకు శాంతి నిచ్చునదియే అగును గాక ! హే సర్వేశ్వర ! నీ శాసనం వలన ఈ బ్రహ్మాండమునందంతటా శాంతియే నెలకొని యున్నది. నీ కృప వలన ఆ శాంతి నా యందును చేరి వర్ధిల్లును గాక !

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

హే రక్షక ! నీ కృపా కటాక్షముచే మా ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆధిదైవిక దుఃఖములన్నియు శాంతించును గాక !

Gayatri Series : 56

**Agnihotram 100% Vaignanikam**

**Rs. 60=00**



శ్రీకృష్ణ ఉవాచ :

**సహ యజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।**
**అనేన ప్రసవిష్యధ్వ మేషవోఽ స్త్విష్ట కామధుక్ ॥**

- భగవద్గీత (3-10)

సృష్ట్యారంభమున ప్రజాపతియైన పరమేశ్వరుడు యజ్ఞముతోబాటు ప్రజలను సృజించి 'ఈ యజ్ఞములతో మీరు వృద్ధిని బొందుదు. ఇవి మీకు ఇష్టములగు కోరికలను తీర్చు కామధేనువు' లన్నాడు.

Published by :
**GAYATRI ASHRAM TRUST**
12-10-586/6, Arya Samaj - Vyas Nagar, Medibavi,
Warasiguda, Secunderabad - 500 061.
(Secretary : SRI K.P. NARSING RAO, Cell : 98480 11073)